

# సావిత్రీసత్యవంతీయము

ఐదంకముల నాటకము





గ్రంథకర్త:
కుంటముక్కల వేంకట జానకీరామశర్మ

# సావిత్రీసత్యవంతీయము

ఐదంకముల నాటకము



గ్రంథకర్త:
కుంటముక్కల వేంకట జానకీరామశర్మ

# అంకితము

క॥ జనకుఁడు లక్ష్మీకాంతను
జనయిత్రియు, నాఁదెమాంబ, సంతసమంద
న్మనుకొని, ఈ నాటకమును
అనురక్తిని, వారికిడుదు, నంకితమనున్.



# గురుస్తుతి

సీ॥ శ్రీగౌతమసగోత్ర శిష్టవంశీలుండు
వేంకయ్య సచివుఁడే వీరతాత
శాంతస్వభావుండు సజ్జనమాన్యుండు
అప్పయ్యమంత్రి యేయనఘ తండ్రి
స్థిరతరసుతకీర్తి శ్రీరామయామాత్య
పుత్రాంశుఁడే ధీర సోదరుండు
జానకీరామయ్య శ్రీనివాస జనార్ద
నాహ్వాయులే మేటిమనుఁగు సుతులు

గీ॥ మాచమయు సుబ్బమయు మల్లమయును రత్న
మ హనుమాయమ్మ లేవురే మంత్రిసుతలు
ఆదిలక్ష్మమ్మ సాధ్వియే యనఘగృహిణి
యట్టి కుంటముక్కల సువంశాబ్ధిసోము
సజ్జనను లక్ష్మీకాంతయామాత్యుఁ దలఁతు.

ఇట్లు
గ్రంథకర్త.

# ప్రశంస

సీ. ఆస్థానకవులయం దగ్రగణ్యులటంచుఁ
బేరొందినార లాత్వేలవారు
కదనరంగములందు ఖడ్గనై పుణ్యంబు
వెలయించినార లాత్వేలవారు
మంత్రులై ఱేఁడుల మన్ననలంబొంది
వెలుఁగొందినార లాత్వేలవారు
పృథ్వీపతులఁ బ్రోవ వేషభాషలు మార్చి
విలసిల్లినార లాత్వేలవారు

గీ. వివిధ విద్యాప్రవీణు లాత్వేలవారు
వేదవేదాంగవేద్యు లాత్వేలవారు
విపుల నిరతాన్నదాత లాత్వేలవారు
విబుధ జనవందనీయు లాత్వేలవారు.

గీ. అట్టి యాత్వేలవారింట నవతరించి
మంచివాఁడను ఖ్యాతినార్జించి యెంతో
పూజ్యతను గాంచినావార! పోచిరాజు
పుండరీకాక్షయామాత్య! బుధ విధేయ!

గీ. ధర్మకృత్యములందు నీసహోదరులు విహితులు
రామకోటయ్య, చలపతిరావు లమర
లోకమున కేఁగిన వెనుక నాకునీవు
కుడిభుజంబయి మెలఁగుట కూర్మిగాదె.

గీ. బ్రహ్మ 'దీర్ఘాయు' వనుచు దీవనలు వలుక
నఖిలబృందారకులు 'తథాస్తు' ని వచింప
జగము లేలెడి శ్రీరామచంద్రమూర్తి
సకల సౌభాగ్యములొసంగి సాఁకుఁగాత!

ఇట్లు
గ్రంథకర్త

# విజ్ఞప్తి

చదువరులారా! నేను " సావిత్రీసత్యవంతీయ " మను నాటకమును సుమారిప్పటికి ముప్పదియారు సంవత్సరములక్రిందట మా గ్రామములోని శ్రీ చెన్నమల్లేశ్వర నాటకసమాజమువారు ఏదేని నొక నాటకమును వ్రాయవలసినదని నన్ను ప్రోత్సాహపఱుప వారల యభిప్రాయప్రకారము గ్రంథము వ్రాయ మొదలిడి కొలఁదికాలములో ముగించితిని.

తదుపరి పైసమాజమువారు నాటకములు ప్రదర్శించుట మానుకొనుట చేతను, మఱికొన్ని కారణముల చేతను నేను గ్రంథమును ముద్రణ కీయఁజాలనైతిని.

అప్పటినుండియుఁ గొందఱు బాల్యమిత్రులదేపనిగాఁ బుస్తకమును ముద్రింపింప వలసినదని కోరుచుండుటచే నిప్పటికైనను ముద్రింపించుటకు బుద్ధిశక్తులొసంగినది " శ్రీ చెన్నమల్లేశ్వరస్వామి " వారి కృపయే కాని వేఱొండు కాదని నా దృఢవిశ్వాసము.

పరిష్కర్తలగు " అష్టావధాని " బ్రహ్మశ్రీ చిల్లర వేంకటేశ్వరకవిగారికిని, వయోవృద్ధులయ్యును శ్రద్ధవహించి పీఠిక వ్రాసి దయచేసిన " అభినవ తిక్కయజ్వ, కవిశేఖర, సహజ పాండిత్య" బ్రహ్మశ్రీ వఝ్ఝు సూర్యనారాయణగారికిని, దయతో సదభిప్రాయము లొసంగిన " ఉభయభాషాప్రవీణ " ప్రతాప రామకోటయ్యగారికిని, " సంస్కృతాంధ్రభాషా పారంగతులు " బ్రహ్మశ్రీ మాలువూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, "కవిభూషణ, కవితాప్రవీణ, శతావధాని, జ్యోతిర్విద్యా విశారద" బ్రహ్మశ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి అయ్యవార్లంగారికిని, " మధురకవి " శ్రీ ఏలేశ్వరాచార్యులుగారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనశతంబులు.

ఇట్లు

బుధవిధేయుఁడు

గ్రంథకర్త.

## ఈ నాటకమునందువచ్చు పాత్రలు

### పురుషులు

| | |
|---|---|
| అశ్వపతి | మద్రదేశాధీశ్వరుఁడు |
| జయశీలుఁడు | అశ్వపతిమంత్రి |
| ద్యుమత్సేనుఁడు | సాళ్వదేశాధిపతి |
| సుబుద్ధి | ద్యుమత్సేనునిమంత్రి |
| సత్యవంతుఁడు | కథానాయకుఁడు |
| నారదుఁడు | దేవఋషి |
| వినమ్రుఁడు | వృద్ధతాపసి |
| మాధవుఁడు | విద్యార్థులు |
| కేశవుఁడు | విద్యార్థులు |
| భద్రుఁడు | భటుఁడు |
| యముఁడు | ప్రేతలోకాధిపతి |
| చిత్రగుప్తుఁడు | యమునియొద్ద లెక్కవ్రాయువాఁడు |
| కింకరులు | యమభటులు |
| జీవుఁడు | ప్రేత |
| ధర్ముఁడు | ధర్మఫలమునుబోధించువాఁడు |

### స్త్రీలు

| | |
|---|---|
| మాళవి | అశ్వపతిభార్య |
| సావిత్రి | కథానాయకి |
| భానుమతి | ద్యుమత్సేనునిభార్య |
| మనోరంజని | సావిత్రిచెలికత్తె |



# పీఠిక

భారతారణ్యపర్వాంతర్గత, మహాపతివ్రతామతల్లి సావిత్రీచారిత్ర
మును, లోకోపకారముగాఁ బ్రకటింపఁదలఁచి పద్యగద్యరూపమున,
ప్రౌఢమధుర పదలాలిత్యముగా నాటకశైలినిగుంటూరుమండలాంతర
తెనాలితాలూకా పెసుగుదురుపాటిగ్రామవాస్తవ్యులు, కంటముక్కుల
వంశపయఃపారావార రాకాసుధాకరులు, గౌతమసగోత్రాపస్తంబసూ
త్రా జెమ్మాంబాలక్ష్మీకాంతయామాత్యాగ్రనందన, వేంకటజానకీరామ
శర్మాభిధానులు "సావిత్రీసత్యవంతీయ" మనుపేరుతో రచించిరి.

ఇట్టినాటకములు పూర్వము కాళిదాసాది సంస్కృతమహాకవులే
రచించియుండిరి. ఇప్పుడాంధ్రకవులును విరచించియుండిరి. విరచించు
చుండిరి. విరచింపనుండిరి. ఈ నాటకమునం దుపమానోపమేయ
ములు, భావప్రకటన కథానుసంధానము పాత్ర పోషణ మొదలగునవి
ప్రశంసార్హములు. గ్రంథ విస్తరభీతిచే నుదాహరణములు విడువఁ
బడినవి. ఇప్పటి నవనాగరికులకు నాటకములపై నభిలాషమెండు.

కావుననే యిమ్మహామహుండును మహోపకారమనిభావించి
స్త్రీ పురుషులకు జ్ఞానోపదేశము చేయుందలంచి మహాపతివ్రతా
చూడామణి సావిత్రియొక్కయు, సత్యసంధుండగు సత్యవంతుని
యొక్కయు, పుణ్యకథావిశేషమును నాటకరూపమున విరచించి ప్రక
టించిరి. దీని ధర్మజ్ఞానవిద్యాభిలాషులెల్లరుఁ జదివి నాటకశాలలలో సర్వ
జనులకుఁ బ్రదర్శింపఁజేసి యానందమును గూర్తురుగాక.

ధూళిపూడి
2-1-50

ఇట్లు
అభినవతిక్కయజ్వ, కవిశేఖర, సహజ పాండిత్య
వఝ్ఝు సూర్యనారాయణ

# అభిప్రాయములు

బ్రహ్మశ్రీ, కుంటముక్కల వేంకట జానకీరామశర్మ గారి దివ్యసమ్ము ఖమునకు — నమస్కారములు.

అయ్యా!

తమరు దయతో నంపిన సావిత్రీసత్యవంతీయ నాటక మామూలాగ్రముగఁ బరిష్కరించు భాగ్యము నాకులభింపఁ జేసినందు లకు దమకు ధన్యవాదములు.

శైలి గంగాస్రవంతిఁబోలి స్వచ్ఛమై ధారాళమైయున్నది. రసవంతమగు కొన్నిపట్టులఁ దన్మయాంత్మకుఁడనైతిని. నాట్యమండలుల వారును, ప్రభుత్వమువారును దమ యీగ్రంథము నాదరించి ప్రో త్సాహ మిత్తురని భావించెదను.

ఇట్లు
విధేయుఁడు
చిల్లర వేంకటేశ్వరకవి.
అష్టావధాని

నిడమానూరు
కృష్ణాజిల్లా
1-1-50

బ్రహ్మశ్రీ, కుంటముక్కల వేంకట జానకీరామశర్మగారిచే రచింపబడిన సావిత్రీసత్యవంతీయ నాటకమునుచూచితి. ఏమా త్రముకుంటువడనిశైలియు, ప్రోపుడులు పెట్టుకొనుచు భావపరంపరలు గలిగి మిగులహృద్యముగానున్నది.

ప్రజాసామాన్యమున మిక్కిలివాడుకయందున్న ఇట్టితివృత్తము లను దృశ్యకావ్యములుగా చిత్రించునపుడు కవిబాధ్యత మిపులగొప్పది; పాత్రపోషణ, రసపోషణ, సందర్భశుద్ధిలోనగువానిపై గ్రంథకర్త ప్రత్యేక శ్రద్ధయుంచవలయుననుట ఈకవిగారు గమనించియేయున్నారు. కవిగా రీరీతిగనే భాషాసేవచేయుచుందురుగాక.

మోదుకూరు
7-1-50

ఉభయభాషాప్రవీణ
ప్రతాప రామకోటయ్య
P.O.L

సకల సాధ్వీమతల్లియగు సావిత్రీదేవి చారిత్రము లోకశాస్త్ర విదితమై సాధువన సమాదరణీయముగా నున్నదిగదా! పాతివ్రత్యమును పారమహంస్యమును ఒక్కటియే అను సుజనసూక్తికి లక్ష్యమై "అవశ్య మనుభోక్తవ్య" మను ప్రారబ్ధమును నిర్జించి సర్వాభయదమైన మృత్యువ్యసనందభయము నొందిన ఈ దేవిమాహాత్మ్యము వాఙ్మనసాతీతము.

ఇట్టి పవిత్రచారిత్రమును సర్వజన హృదయంగమ మగు నాటకశైలిని రచించుట ఉభయతారకముగాన సార్థకమనుటకు సంశయములేదు.

గుంటూరు మండలాంతర్వర్తి, తెనాలితాలూకా, పెనుగుదురు పాటి గ్రామవాస్తవ్యులును, కుంటముక్కల శుభవంశమణి దీపాయమానులును, ఐన బ్రహ్మశ్రీ వేంకట జానకీరామశర్మ గారీ సావిత్రీ సత్యవంతీయ నాటకరాజమును లోకోపకారార్థము రచించిరి.

ప్రసాదాది గుణములుకలిగి మృదుమధురశైలి నొప్పుచున్న యీకవిచంద్రుని కవితామృతమును కొంత ఆస్వాదించి వరమానందభరితుండనైతిని. అవిగీత నీతిబోధకమగు నీనాటకములోని మధువులాస్వాదించిన గుణగ్రాహులు కళ్యాణభాజనులు కాకపోరు.

సత్యదేవతానుగ్రహమున సావిత్రీసత్యవంతులవలె ఏతత్కవితా కవిశేఖరులాచంద్ర తారకముగ సుఖింతురుగాత.

అనంతవరము
10-1-1950
మూలుపూరు సుబ్రహ్మణ్యశాస్త్రి

బ్రహ్మశ్రీ, కుంటముక్కల వేంకట జానకీరామశర్మకవిగారు నాకపూర్వపరిచయులు. వారికినాయందు విశ్వాసముకలుగుటకు కారణము శ్రీ జానకీరాం ప్రెస్ వారు. శ్రీ కవిగారునన్నుదోలుదొల్త యిదియేచూచుట. వారి యీ"సావిత్రీసత్యవంతీయ"మనునాటకమును నాకొసంగి దీనినిమీరామూలాగ్రముగాఁజూచి, మీయభిప్రాయము నొసంగుడనియనుటచే, నేనీ నాటకమును నాంది మొదలు గద్యాంతము వఱకు శ్రద్ధగావింటిని.

పండితులుదోషజ్ఞులనుట సర్వసామాన్యవిషయముగాఁద్రోచి పుచ్చి యీనాటకమునందు నన్నానందింపంజేసిన విషయములను ప్రశంసించుచున్నాను. కవిత్వము వెతకితెచ్చియతికికొనినట్లులేక ధారాళముగా నున్నది. పాత్రౌచిత్యము చక్కగాగమనించి వ్రాయబడియున్నది. సావిత్రికి తల్లిదండ్రులు, అత్తవారింటనుండు ధర్మములనుపదేశించునపుడు లోకసామాన్యధర్మము వ్యక్తీకరింపఁబడుచున్నది.

భూలోకమునకు యమలోకమునకు సరిహద్దునిర్ణయము, యమధర్మరాజుచేఁజెప్పించునప్పుడును, యమభటులచేఁబట్టుకొనఁబడిన యొక జీవిప్రక్కలో త్రాఁచుపామసికొడుకునకు బోధించునప్పుడును, తమవంశపరంపరాసహజసిద్ధమగు కరణీకములోనిఘాటుతనము వెలువరింపఁబడుచున్నది.

యమధర్మరాజుముందు యమభటులువేరువేరుగా ననేకజీవులనుతోడ్కొనివచ్చినప్పుడు చిత్రగుప్తునిచే వారివారి పాతకములు నిర్ణయింపఁబడి, వానికిఁదగినశిక్షలను యముఁడు విధించునప్పటిఘట్టము సహజముగా భారతీయమతధర్మములను బోధించుటయేగాక యధర్మములాచరించువాఁడుగలిగెడు నరకబాధలవలని భయమునుసూచించుచున్నది.

సావిత్రి యమునితోఁజెప్పినఁ పతివ్రతాగాథలు స్త్రీలకు నీతినుపదేశించుచున్నవి. కాన యీ నాటకమువ్రాసినకవిగారు ఆంధ్రదేశ

మునకు నైతికసాహాయ్యమొనరింపఁజాలిరి. వీరు యీనాటకమునుచాలా చిన్నతనములో వ్రాసితిమని చెప్పియుండిరి. నేఁడువీరికిఁబోఁటు కవితా కన్యయు ప్రౌఢయైయుండును. కాన చక్కని నాటకములనువ్రాసి భాషాసేవయొనర్చి, ఆంధ్రజనస్తుతి పాత్రులగుదురుగాత! వీరు యీ నాటకమున పలుమారు ప్రాసంగికవశముగాఁ బేర్కొనినపరమేశ్వరుఁడు వీరికి దీర్ఘాయురారోగ్యకీర్తులనొసంగి రక్షించుగాత!

స్వస్తి శ్రీ

ఈమని
తెనాలితాలూకా
ది 11–1–50

ఇట్లు,
కవిభూషణ, కవితాప్రవీణ, శతావధాని, జ్యోతిర్విద్యావిశారద.
ముదిగొండజ్వాలాపతిలింగశాస్త్రిఅయ్యవారు

---

కవిత నావిష్కరింపఁజేయుట ఒక సుకృత విశేషమందును. అందును గద్య పద్యరచనలకన్న నాటకములరచించుపట్ల కవిఅపూర్వ భావనిష్ఠాగరిష్ఠతను రూపొందించును. నటకుఁడుకానివాఁడు నాటకము రచింపఁజాలఁడు.

ఈ సావిత్రీసత్యవంతీయమునురచించిన మన్మిత్రులు బ్రహ్మశ్రీ కుంటముక్కల వేంకటజానకీరామశర్మగారు నటకుఁడా యనియందు రేమో? కాదు – అని నేనే చెప్పుచున్నాను. మఱి స్వవచోవిఘాత మగుటలేదా? యనిబల్కుఁడు. సమాధానమిది.

జగన్నాటకమున తా ధరించినపాత్రలో ధర్మాధర్మముల – యుక్తాయుక్తముల – న్యాయాన్యాయముల సమాలోచించుకొనుచు అడుగడుగున తన యుజ్వలభావప్రకటనచేయుచు జీవితమును గడపుచున్నకవి.

తాను సముపార్జించిన స్వానుభవవిశేషంబులను సావిత్రీ సత్యవంతుల పాత్రలలోనిమిడ్చి చూపించిన సన్నివేశకల్పనలు - మధుర భావములు - ధర్మనిరూపణములు హృద్యములు.

తపోవనమునసత్యవంతునెడసావిత్రితొలివీక్షణములోని మధురిమమునను - తా వలచిన కడుపేదమగని చేపట్టుపట్ల సావిత్రి తలిదండ్రుల యనుమతిబడయు భావనిష్ఠను - భర్తృజీవములు తెచ్చికొనుటకు యమునితోడి వాదప్రతివాదముల సల్ప్రతావునను - అశ్వపతి ద్యుమత్సేనరాజగౌరవలాంఛనములు నెరకొనుసంభాషణములను కవికలము తాండవించినదనుటకెట్టిసందియమును లేదు.

ధర్మోపదిష్టములగు గద్యపద్యకావ్యముల గూడ నీ కవిచే వ్రాయించుటకు పరమేశ్వరుడు వీరికిప్రసన్నుడగుగాక యని నా యభీష్టము.

మధురకవి

తెనాలి
12-1-50

ఏలేశ్వరాచార్యులు
విశ్వాజ్ఞమండలి



ఓమ్

శ్రీ హయగ్రీవాయనమః

# సావిత్రీ సత్యవంతీయము

## నాంది

మ. తన రాజ్యంబు రిపుల్హరించినను నిందావాక్యముల్పల్కుచు
న్ననుఁ గష్టంబులు వెంబడించినను నానాప్రాణివర్గంబుల
న్గని మాయావృత మీ ప్రపంచమనుచు న్భావించి సత్యంబు ద
ప్పని రాజన్యకుమారు నోమిన తపఃప్రావీణ్యమేలు న్మిమున్.

గీ. జనపదంబులఁ బెడఁబాసి వనములందుఁ
బరమనిష్ఠాగరిష్ఠతఁ బ్రబలియుండు
భక్తసంచయు రక్షణ భర్తయైన
నరహరియె ప్రోచుఁగాత మీ నర్తకులను.

( సూత్రధారుఁడు నాంద్యంతమునఁ దెరవంకఁజూచి )

సూత్ర:- ప్రేయసీ! నీయలంకారము పూర్తియైనచో నొకమాఱిటురమ్ము

నటి:- (ప్రవేశించి) మనోహరా! ఇదే వచ్చితి. [నమస్కరించును]

సూత్ర:- ఆహా! ఏమి యీ శృంగారము!

గీ. ఉల్లిపొరవంటి పావంబట్టు వల్లెవాటుఁ
బసిఁడిహారంబు లటులిటుఁ బడుచునుంటఁ
గంటి నుద్వాహవేళ నో కాంత! మరలఁ
గాంచితిని నేఁడు కన్నుల కఱవుదీఱ.

నటి:- ఆ విషయం బటుండనిండు. ప్రస్తుతము నన్ను రమ్మనిన కార
ణముఁ దెలుప వేఁడెద.

సూత్ర:- ఏమీ! కారణమెఱుంగవా? అట్లయిన వినుము.

చ. పరసులు పండితోత్తములు సత్కవివర్యులు నాటకప్రియు
ల్వరుసలు దీర్చియుండిరదె! వారలఁ గంటివె? తోయజాక్షి! ఈ
వరభవనంబునం గలుగువారల వాంఛితమేమొకో యటం
చరయుటకై యిటు ల్పిలువనయ్యెను గారణ మీ వెఱింగితే?

నటి:- నాథా! నన్నడిగెదరేల?

గీ. ఎల్లకార్యంబులను నిర్వహించుకొనుచుఁ
బదములంజుట్టి యేడ్చు నర్భకులఁబోఁడ
క్షణము తీఱిక లేకింట సంచరించు
నింతులకు నన్యవిషయంబు లేమిపట్టు.

సూత్ర:- సఖీ! ఇంచుకయైనను విచారింపలేక పోయితివే? సభాస్తారులు మనమిచటఁ బ్రదర్శింపఁబోవు రూపకనామ మెద్దియో వినఁ గుతూహలురై యున్నారు గదా!

నటి:- అది యెద్దియో నేనును వినఁగుతూహలినై యున్నదాన.

సూత్ర:- (ఆశ్చర్యము నభినయించుచు) ఏమీ! అదియు నెఱుంగవా?

గీ. కులటలకునెల్ల పతిభక్తిఁ గలుగఁ జేయుఁ
జెనటులకు నెల్ల గురుపూజఁ జేయఁ గఱపు
నెల్లజగముల కానందమిచ్చుచుండు
నిద్ధ సావిత్రి సత్యవంతీయ మబల.

నటి:- అద్దానిని రచించిన కవి యెవరు?

సూత్ర:- కవితో నేమి ప్రయోజనము? నాటక గుణాగుణంబులే ప్రధానములు గదా!

నటి:- కాదు! కాదు!! మనమేదేని యొక నాటకమును బ్రదర్శింపఁ బూనినపుడు పురంబుల జనంబులే కవివర్యునిచే రచింపఁబడిన దని యడుగుట సామాన్యమే కదా! అటులనే కవి యెవరో వినఁ గోరెద.

సూత్ర:- సరి! సరి!! నిజమే. మఱచితి ఎవరంటివేని చెప్పెదను వినుము.

గీ. కుంటముక్కల వంశాబ్ధి కుముదహితుఁడు
గౌతమస గోత్రుఁడు నియోగికర్మఠుండు
నాదెమాంబ లక్ష్మీకాంతయల సుతుండు
ప్రథిత వేంకటజానకీరామశర్మ.

కాంతామణీ! ఇప్పటికే కాలవిలంబమును గూర్చి సభాసదు లొండొరులతో ముచ్చటించుకొనుచున్నారు. మన మింక భావికర్తవ్యంబునకుఁ దయారుపడుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.) [ఇది ప్రస్తావన]

శ్రీరస్తు

# సావిత్రీ సత్యవంతీయము

## ప్రథమాంకము

( సావిత్రియుఁ, జెలికత్తెయగు మనోరంజనియు నిజపురము నకుఁబరిసరమున నున్న తపోవనములోనికిఁ బ్రవేశింతురు. )

సావి:- మనోరంజనీ! వనంబెంత యానందాతిశయముల నొప్పారు చున్నదో చూచితివా?

చ. సకల లతావిశేషములు చక్కని సద్మములో యనంగ, వా
నికెనిడు రంగవల్లికల నేర్పను జూపెడు రంగులో యనన్
వికచసుమంబులల్లవె, నవీనపుఁ బాటలనేర్చుచున్నవా
శుకపికలోకమో యనఁగ సొంపువహించె వనంబుఁగాంచితే!

వెండియు,

సీ. పల్లెఁ బట్టణమును బాసి జపముఁజేయు
తపసుల కిరవైన ధామమెద్ది!
దొంగతనముసేసి దొరలకుఁ జిక్కని
పాటచ్చరులకు నివాసమెద్ది?
మృధఁ బరాజితులయ్యుఁ బృథ్వీరమణు లాలి
బిడ్డలతోఁ జేరు విశ్వమెద్ది?
జంతుజాలములెల్ల సహజవిరోధముల్
తీఱిచరించు ప్రదేశమెద్ది!
గీ. ఓషధీతతిఁ జిక్కొంట నొప్పునెద్ది?
భూరిసంపదలిచ్చెడు భూమియెద్ది?

సకలజనులను గాపాడు సరణిమెద్ది ?
యనిన మనమిప్పుడున్న యీ వనముగాదె !

ఇదియునుంగాక, సకలజనమను పరిపూర్ణాభిరామంబును, సమస్త తరు శోభితంబును, నిఖిలపక్షి కోలాహలంబును నయి నేత్రానందకరంబులగు సరోవరంబులును, గలిగి యొప్పారు నీ వన విశేషంబులఁ గాంచుచున్నది మొదలు, మన నికాయంబుల మాటయే మఱపునకు వచ్చుచున్నదిగదా !

మనో:- ఇట్టి మహావైభవంబులఁ దులఁదూఁగు నీ యరణ్యంబును గాంచినది మొదలు, నీకేకాదు, నాకును నటులనే, తోఁచు చున్నది.

సావి:- అదిగో ! అటుచూడు.

గీ. పావురము డేగయును గూడి పాటుచుండె,
కోకిలయుఁ గాకమునుగూడి కూయఁదొడఁగె,
ఖనకమును బిల్లియునుగూడి గంతులిడుచు
నుండె, జాతివిరోధంబు లుడిగి యచట.

మఱియు,

క. మృగయుఁడు హింసింపకయే
ఖగములఁ బరికించుచుండెఁ గడు సద్బుద్ధిన్
బగఁ గొనువారలు లేరీ
జగతిని నిటువంటి సఖ్యసంపద గలదే !

మనో:- అమ్మా ! ఋషీశ్వరు సేవించు నిమిత్తమును, వారిచే నిర్వహింపఁబడుచున్న పాఠశాలలోఁ జదువుకొనుటకును, మనను బయలు దేఱితిమే కాని, వృథగా నీ వనంబునఁ గల వినోదంబులఁజూచుచుఁ బ్రొద్దుపుచ్చుకొన వచ్చినవారము కాముగదా!

సావి:- ఔను ! కాదన్నవా రెవరు ? పోవుదముపద.
(అని కొంచెము నడచి, ఆశ్చర్యము నభినయించుచు,
నెచ్చెలీ ! ఆ దివ్యసుందరుని జూచితివే ? ఆహాహా ! నే నీ

దినంబున నే పుణ్యాత్ముల మోముఁజూచి బయలు దేఱితినో?
లేక, నా పూర్వజన్మసుకృతఫలమే యీరీతి ఫలింపఁజొచ్చెనో
కాని, నేఁడు నా మనోరథంబులలో నొకటి మాత్రము, నెఱ
వేఱఁగలదని నాకుఁ గొంత యాస పొడము చున్నయది. ఏ
మంటివేని ?

సీ. రాకాసుధాకర ప్రభమించు వదనంబు
శ్రీకారములమించి చెలఁగు శ్రుతులు
కిసలయంబుల నేలు కెమ్మోవిచందంబు
కలువలనొంచు మేల్ కనులఠీవి
యరవిందములనెంచుఁ గఱిసౌష్ఠవంబు స
చ్చామీకరంబు మైచాయడంబు
బంభరంబులఁదోలు బారు పెండ్రుకచాలు
దాడిమంగేరు దంతముల తీరు

గీ. పలుకు బెళుకులు నా నడకల ఘటింప
విరహిణీస్త్రీల వేఁటాడు వేఁటకాఁడె
యనఁగ నొప్పెడు యువకుఁడ వనములోన
మెఱసె నాచక్కిఁ దొలకరిమెఱపు వోలె.

నా కోమలాంగుఁ డెవరో కాని, నే నా దివ్యసుందరుని దర్శించి
నది మొదలాతఁడే వరుఁడు కావచ్చునని యించుకంత, యాస
పొడము చున్నయది. ఇదియునుంగాక, మన్మథసాయకంబులా
హెచ్చుచున్నవి. మనసా చలించుచున్నది. నడచెదనన్నఁ
బాదములా తడఁబడు చున్నవి. వీని కంతకుఁ గారకుండతఁడే
కావున నాతఁ డటనుండెనేమో యించుక యావలకుం జని
పరికించి వచ్చెద. చెలీ! నీ విచటనే యుండుము. [కొంచెము
నడచి ] ఓ! మన్మథాకారా! సౌందర్యరాశీ!

గీ. దారిఁ గానక యుంటి వైశ్యారిసాక్షి
నొజ్జకడకేఁగు మార్గంబు నో దయాత్మ!

తెలిపి పోఁగదె మొఱలిడు దీనురాలి
రక్షణము సేయు నుండు భ్రమంబొకండు.

(చిన్నఁబోయి) ఏమీ నా కీ సుస్వాన్తైకల్యము ! కన్నెమైనఁ జెదరి యుండెనా ! లేక ప్రాయమే నా కిట్టి తొట్రుపాటును గలిగించెనా ! ఒకవేళ నీ రెండునుగాదేని మనుష్య సంచారములేని యీ యరణ్యంబున నెచ్చెలులతోఁ గలిసి మాట్లాడినట్లు మాట్లాడఁ గలుగుట యెట్లు ! ఏది యెట్లున్నను ఋషీశ్వరు సేవ కఱుగవలయునుగదా! నా కంటె ముందు మనోరంజని, పోయియుండదుగదా ! ఈ యాలస్యమును గూర్చి ఋషీశ్వరులు నన్నేమైన నడుగక మానరు. అడిగినప్పుడు పితృసమానుఁడైన గురువు గారితో నే నీ జరిగిన వృత్తాంతమంతయుఁ గొంచమైనను దాఁచక యెఱింగించెద. అందువలనఁదప్పఁ గాని నా మనస్సందేహము తీఱదు. నా కొఱకు మనోరంజని వేచి యుండునేమో ! నే నిప్పుడే యామెను గలిసికొని ఋషిసేవ కరిగెద. (అని వెనుకకుఁ దిరిగి మనోరంజనితో నిష్క్రమించును)

(తెరపడును)

## ద్వి తీ య రం గ ము

(అరణ్యము, జితేంద్రియ మహర్షి ఆశ్రమము)

జితే— (తనలో)

ఉ. (శ్రీ) రమణీమనోహరుఁ డశేషజనంబులఁ బ్రోచుతండ్రి, సంసారమహార్ణవోత్తరణ సాధకకర్త, పురందరాది బృందారక కీర్తనీయుఁడు, వదాన్యుఁడు, దారుఁడు, యాతుధాన సంహారకుఁ డెల్లవేళల మదాత్మఁ బరీక్ష యొనర్ప వేఁడెదన్.

మఱియు,

సీ. దుర్మార్గ నిరతుల దుండగంబులు వాపి,
సన్మార్గరతులఁ గాఁ జులుపు నెవఁడు ?

సకలలోకంబుల సకలభూతంబుల
కాధారమై ప్రాణి నాద్యుఁడెవఁడు ?
జనపదంబులఁ బాసి జపతపంబులఁ జేయు
సంయమీశ్వరులకు సాయమెవఁడు ?
పదునాల్గు భువనంబు లుదరంబున నిమిడ్చి
రాగిరై విలసిల్లు రాజెవండు ?
గీ. ఘోరదానవ చయములఁ గూల్చె నెవ్వఁ
డాదిమ ధ్యాంతరహితుఁడై యలరు నెవ్వఁ
డట్టి పరమేశు మాధవు ననుదినంబు
భక్తిఁ బ్రార్థింతు మదిలోన ముక్తికొఱకు.

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములను, నాలు గాశ్రమములలో, గృహస్థాశ్రమ ముత్తమ మని పెద్దలు వచింతురే కాని, దానికన్న నశేష జనపోషణ ప్రాభవుండును, శిష్టజనరక్షకుండును, దుష్టజనశిక్షకుండునునగు శ్రీమన్నారాయణుని దివ్యచరణారవిందంబులఁ గొనియాడుచు, నెల్లప్పుడు, హరినామస్మరణఁ జేయుచుఁ, గందమూలంబుల భుజించుచు, వనంబులఁ, దపం బాచరించుకొను మాబోఁటి యతీంద్రుల, నష్టైశ్వర్యంబులఁ దులఁదూగు నయ్యింద్రుని సమానులగు వారెల్లరుఁ "గాషాయ వస్త్రంబులఁ గట్టుకొను వారందఱు యతులేనా" యని పరిహసింతురే కాని, "జాతస్య మరణం ధ్రువం" బను నార్యోక్తి నించుకయైనను బాటించు వారొక్కరైనను, లేరు. పోనీ! నా కెందుల కీ గొడవ ? నేఁడింతవఱకు మదీయ శిష్యులలో నొక్కరైనను రాకుండుట కేమి హేతువో తెలియకున్నది. ఎవరు రాకపోయినను సావిత్రి యొక్క నిమునమైన నింటికడ మసలునది కాదు. ఒకవేళ యౌవనవతి యగుటచేఁ,

క. జననీ జనకులు "పుత్రీ!
చన వల దీకవిూఁదఁ జదువుఁ జాలింపు" మనన్
మనమునఁ గుందుచునుంటెను
జన వంద్యంబయిన కావ్య సంపద కొఱకై.

(అంతఁ బుస్తకములతో మాధవ కేశవులు ప్రవేశింతురు)

మాధ:— క. వందనము తాపసేంద్రా!
వందనము దయాంతరంగ! వరగుణసాంద్రా!
(అని నమస్కరించును)

కేశ:— వందనము గురువరేణ్యా!
వందనము మహానుభావ! వందనమార్యా!
(అని నమస్కరించును)

జితేం:—ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు. శీఘ్రమేవ విద్యాప్రాప్తిరస్తు.

మాధ } అయ్యా! నే డాలస్యముగ వచ్చినందులకు క్షమింపఁ
కేశ } గోరెదము.

జితేం:—(ఆశ్చర్యము నభినయించుచు) ఏమేమీ! మిమ్ముల క్షమింప వలయునా? మంచిది. సావిత్రి యెక్కడ?

మాధ:—అయ్యా! రాలేదండి.

జితేం:—రాకపోవుటకుఁ గారణమేమైయుండునో, మీ కేమైనఁ దెలియునా!

కేశ } (గడగడ వణఁకుచు) అయ్యా! మాకుఁ దెలియదండి.
మాధ }

జితేం:—మాధవా! ఏదీ! భగవత్ప్రార్థనఁ గానిమ్ము.

మాధ:—

చ. కరముల శంఖచక్రములుఁ గాంచనచేలము తార్క్ష్యవాహనం
బరయఁగ శార్ఙ్గమున్నలిగి యాజినొనర్చుచు దుష్టశిక్షకై

సరసజనాళి కెల్లరకు సౌఖ్యమొసంగెడు వాఁడెవండొయా
పరమదయాళునిం గొలుతు భవ్యశుభంబొడఁగూర్చ నిచ్చలున్.

(అంతఁ బుస్తకములతో సావిత్రి ప్రవేశించును.)

సావి :— గురూత్తమా ! అభివాదములు.

(అని నమస్కరించును)

జితేం :— ఆయుష్మతీభవ !

సావి :— విబుధాగ్రేసరా ! గురువరా !

ఉ. ఉత్కటతర కావ్యనాటకము లున్నవిగా యని యచ్చటచ్చట
న్బిరబిర నాల్గు శ్లోకములు పెద్దలు మెచ్చెడి భాతి వల్లనం
గలిపిన సాహితీ గరిమ గల్గ దదెంతటి వారికైననూ
గురువర ! చెప్పవే వరుసఁ గూటమి మూర్ఖక కావ్యసర్గలన్.

జితేం :— అమ్మా ! సావిత్రీ ! నేఁ డెంత కర్ణానందముగ వచించితివి ! ఇప్పటి కెందఱో విద్యార్థులు నా యొద్ద విద్యనభ్యసించిన వా రుండిరి; కాని వారిలో నొక్కరినోటనైన నిటువంటి శుభ ప్రదమైనమాట వచ్చిన దేకాదు. ఇదియునుంగాక, "తిను మన్నఁ బులిగైనను దినవచునట్లు" చదువు చెప్పించెడి వార లుండఁ జదువుకొన నొల్లక, మూలగూలలఁ దూఱి నిరక్షర కుక్షులై చెడిపోవు బాలకులో కలరు; గాని తుద కా ఫలితము ననుభవింపక తప్పునది కాదు. మఱియుఁ బాలకాలకుఁ బోయెడు పిల్లకాయల లక్షణంబులఁ గొన్నింటి నెఱింగించెద నాకర్ణింపుము.

మ. తలిదండ్రుల్ బడికంపుచో సుతులు తాఁ జేరి యేడ్వంగఁ "బం
తులతోఁ జెప్పుమఁ గొట్టకుండ" నని నీతుల్ సెప్పి యోదార్చియా
వలఁ బంపంగను బోవురే యరుదిఁ కేపాఠంబు రాదేఁగినం
దెలియంజాలర దెంత చెప్పినను బ్రీతిన్ శ్రద్ధలేకుంటచేన్.

సావి :— ఋషిచంద్రమా ! ఇవియన్నియు మీ యనుభవములోని సం గతులనియే నానమ్మకము.

జతేం:- ఔను! క్రొత్తగఁ గల్పించి చెప్పిన దేదియు లేదు.

మాధ:- ( కేశవునివంక జూచి ) కేశవా! ప్రాతపాఠము లేమైనను జదివితివా? గురువుల వారీ దినము పరీక్షింతుమని కదా మనతోఁ జెప్పి యుండిరి.

కేశ:- ఔను! ఏదో యొకనూఱు నిన్న నిచటనే చదివితిని.

జతేం:- ( మాధవ, కేశవుల నవలోకించి ) మీరుపోయి, యా పూల చెట్లకు నీళ్లు పోయుఁడు.

కేశ:- } చిత్తము. (నిష్క్రమింతురు.)
మాధ:- }

సావి:- ఋషీశ్వరా! క్రొత్త పాఠం బే దేని సెలవియ్యరా?

జతేం:- అమ్మా! సావిత్రీ! అటులనే చెప్పెదను; కాని నీ వీ దినంబున, మదీయాశ్రమంబున, కాలస్యముగా వచ్చుటకుఁ గారణంబేమై యుండును?

సావి:- ( తలవంచి మాటాడ కూరకుండును. )

జతేం:- అమ్మా! నిరుత్తర వైతివేల?

సావి:- ఓ పండితమాన్యా! గురువరా! కారణం బేమున్నది.

( అని సందేహించును )

జతేం:- అమ్మా! సావిత్రీ! కారణము లేదని సందేహించి, నీవు చెప్పకున్నను, నీ వదనకమలంబున నేదో కారణ మున్నటుల స్పష్టమగు చున్నది. కావునఁ దగిన సమాధానమును జెప్పుము.

సావి:- ( ఊరకుండును. )

జతేం:- అమ్మా! ఊరకుండెద వేమి? నీ వెటువంటి పరమరహస్యమై నను బిత్రుసమానుండనగు నాతోఁజెప్పవచ్చుఁ దానఁదప్పు లేదు.

సావి:- గురూత్తమా! (అని సిగ్గు నభినయించును )

జతేం:- తల్లీ! సిగ్గుపడెద వేల? నిస్సందేహముగాఁ జెప్పవచ్చు:

సావి:- ఋషికులతిలకా! నేనీ దినంబున భవదీయాశ్రమంబునకు వచు

అంత భ్రమ నొందిన మనస్సు గలదాననై యా నూతన పురు
షుని రూపలావణ్యంబుల గుఱించి విచారించుచు, నే నొక్క
ముహూర్తకాల మచ్చటనుంటి నంతియేకాని, మఱేమియు
నెఱుంగ. ఇక నొకవేళ నాయువకుని వృత్తాంతము దెలిసిన
యెడల నాకుఁజెప్పఁ బ్రార్థించుచుంటి.

జితేం :—అమ్మా! నీవు నిక్కము వచించితివి. నే నా బాలుని
గూర్చి నాకుఁ దెలిసినంతవఱకుఁ జెప్పుచున్నాఁడ నిదియే
యాకర్ణింపుము.

సీ. నిత్య సత్యవ్రత నియతి నుండెడువాఁడు
తల్లిదండ్రుల యాజ్ఞఁ దాటువాఁడు,
షట్శాస్త్రములనోలిఁ జదువనేర్చినవాఁడు,
స్వజన స్నేహంబు సలుపువాఁడు,
నపకార మొనరింప నాత్మ నొప్పనివాఁడు,
సన్మార్గ పద్ధతిఁ జనెడువాఁడు,
కాంచనంబును మించు కాంతి గల్గినవాఁడు,
జ్ఞాన యుక్తంబైన శమమువాఁడు,
గీ. నిఖిల భూతంబు లొకటిగ నెమ్మనమునఁ
దలఁచుచుండెడు వాఁడునై తనరియుంట,
వసుధ జనులెల్లరును సత్యవంతుఁడనఁగఁ
బేరుఁ గన్నాఁడు దిక్కులఁ బిక్కటిల్ల.

అదిగో! కనఁబడుచున్న యా పాదపంబు క్రిందఁ దపం బాచ
రించుకొను వృద్ధుండగు ద్యుమత్సేనునిపుత్త్రుండు సత్యవంతుండు.
అతనికిఁ జిత్రాశ్వుండను నామాంతరంబునుం గలదు. ఆతని
తండ్రి యాది నుండియు మునివృత్తి నున్నవాఁడు కాఁడు.
కొంతకాలము సాల్వదేశమును బరిపాలించి, పిమ్మట వృద్ధా
ప్యంబున కన్నులులేమి శత్రువులచే రాష్ట్రంబు వెడలఁగొట్టఁ
బడి యా కారణంబున విగతరాజ్యుండై దారాపుత్త్రి సమే

తంబుగ నీ వనంబునఁ గాలంబు గడపుచున్నవాఁడు. అతని గొనముఁ దన్ననో సహస్ర విస్మయంబందుదువు. నిపుణాశ్వపతివాలిన బిట్టంపని చెప్పుటకెట్టి సందియము లేదు. సత్యంబే కాని యసత్యంబు కనుకొనుల నెన్నఁడై యున్నను, నాడువాఁడు కాఁడు. ఆ కారణమున నీ వనవాసులగు ఋషీశ్వరులును తదితర జనంబులును సత్యవంతుఁడను పేరఁ బిలుచుచున్న వారు. మఱియు నాతని సద్వృత్తప్రభావంబెన్న నలువచెలువకేనియు నలవికాదు. బుద్ధికి బృహస్పతి సమానుఁడు; శూరత్వంబున మహేంద్రున కెనయగువాఁడు; శమదమాది గుణంబుల నసుంధరఁ బోలినవాఁడు; రూపంబునఁ గంతుజయంతాశ్వినేయులను దిరస్కరించెడివాఁడు. బ్రాహ్మణభక్తిగలిగి సదా వర్తించు చుండువాఁడు. కావున నతని సమానులగు వారీముల్లోకంబుల లేరని గట్టిగా నొక్కి వక్కాణింపఁ గలను. ఇదియే యాతని గుఱించిన వృత్తాంతము. ఇప్పటికే కాలమతిక్రమించినది. నీ వింక సదనంబున కరుగుము. నేనిచే జపతపహోమాది క్రియల నెఱవేర్చుకొనఁ బోయెదను.

(నిష్క్రమించును.)

సావి :-(తనలో) ఆహా! సౌందర్య మొకరిసామ్మా? భారతీ మనోహరుండెంత ప్రయత్నంబున సృజించెనో కాని,

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయము వాని
నలువైన కరచరణముల వాని
శంబరారిని నేలు చక్కందనము వాని
రంగారు కుంతల రాజివాని
జలజాతములనేలఁగల కన్నుగవ వాని
సమమైన పీన వక్షంబువాని
విల్లునంబులు బూని వేఁటాడు మొనగాని
రాజచిహ్నంబులఁ గ్రాలువాని

గీ. దివ్యతర మేనికాంతులు తేజరిల్లఁ
దనుమునసం గాడేఁ బావఁగాఁ దగినవానిఁ
బాతశాలకు వచ్చుచుఁ బథమునందుఁ
గాంచితిని వానిఁ నిపుడెట్లు గాంచఁగలను ?

కొండీయు నే నీమార్గముననే పరీక్షించుచుఁ బోయెద; నొకవేళ నా యదృష్టవశమున నా సుకుమారుండు నా కంటఁ బడు నేమోయని కొంత యాశ జనించుచున్నయది. (కొంచెము దూరము నడచి) ఏమీ ! ఇచ్చటి కెంత దూరము నుండియో దశదిశలఁ బరీక్షించుచు వచ్చినను, నెచ్చటను గానఁబడకున్నాఁడు కానిమ్ము. ఈ వనవాసుల కేమైనఁ గానుపించెనేమో యడిగి తెలిసికొనియెద; నందుమీఁద నాపుంబున కేమైనఁ గొంత ధైర్యంబు చిక్కునేమో !

సీ. కరులార ! భయభల్లుకములార ! కపులార !
ఝరులార ! కంటిరే సత్యసంధుఁ
దరులార ! సారంగ తతులార ! నదులార !
పులులార ! కంటిరే బుద్ధిశాలి
కామధేనువులార ! కంఠీరవములార !
మునులార ! కంటిరే పుణ్యచరితుఁ
జక్రవాకములార ! శశసమూహములార !
గిరులార ! కంటిరే సరసవచను

గీ. బకములార ! భయంకర వృకములార !
శుకములార ! సంగీత శారికములార !
పావురములార ! పరభృత పంక్తులార !
కాంచితిరె ? సత్యవంతు నిక్కాననమందు !

(కొంతతడవాలోచించి) ఏమీ ! మదీయ దీనాలాపంబుల కొక్కరైనను బ్రత్యుత్తరంబిడిన వారులేరే ! అయ్యో ! నే నెంత యదృష్టహీనురాలను. హీనురాలనేకానిచో నాతఁడు

నాకంటఁ బడకయే యుండునుగదా! ఒకవేళఁ గంటఁబడినను, నే నప్పుడే వానివెంట నేలచననైతిని? చనినచో నాతఁడు మాత్రము నిరాకరించునా? నిరాకరించినను నేనేమి చేయఁగలను. చేయకుండినను నీకు నేమాత్రము కన్నులారఁగాంచు భాగ్యము లభించెడిదికదా! లభించిన నేమి ప్రయోజనము! ఇంతకు నా మందబుద్ధియే స్వప్నమ్ము జేసినదై నా కంటెనుండు నడచుచుండ నే నేమి చేయఁగలను? హా! ఇది యంతేయు నిట్లుండ, మదీయ గురువు లాశ్రమంబున విగతరాజ్యుఁడని కూడ వచించిరి. లేనిచో నాతని రూపరేఖా విలాసంబులును, వానికిఁ దగినట్లు వస్త్ర సౌష్ఠవంబు విద్యా విభవంబును, మదీయజననీ జనకుల కెఱింగించిన సమ్మతించెదరేమోకదా! గతించినదానికై నేనిప్పుడు వగచిన ప్రయోజన మేమున్నది. ఏది ఎట్లైనను సరే! మదీయేష్టదేవతయగు సావిత్రీదేవినిం గూర్చి ప్రార్థించెద; నందుమీఁద నా తల్లి కేమైన నా యందు ననుగ్రహము కలుగునేమో? ( అని కరములు ముకుళించి ) ఓ జగజ్జననీ! కాత్యాయనీ!

చ. అనిశము నీ పదాంబుజము లాత్మఁదలంచెడు భక్తురాలనో
జననీ! మదీయవాంఛితము సమ్మతితో నొనరించి మీఁద మ
జ్జననికిఁ దండ్రికిన్ విబుధసంతతికిన్ బ్రియమారఁ జెప్పు నా
మనవిని జిత్తగింపు మృడుమానిని! హైమవతీ! సతీమణీ!

( నిష్క్రమించును. )

ప్రథమాంకము — సంపూర్ణము.

శ్రీరస్తు

# సావిత్రీ సత్యవంతీయము

## ద్వితీయాంకము

(అశ్వపతి, జయశీలుఁడు, కూళవి, పీఠముల మీఁదఁ గూర్చుండురు)

[ తెరయెత్తఁబడును ]

అశ్వ :—మంత్రీ ! జయశీలా !

చ. కుశలమె మౌనివర్యులకు ఘోరవనాంతర సీమలందునం ?
కుశలమె భూసురేంద్రులకుఁ గ్రూరజనావళి బాధలేకయే ?
కుశలమె సాటివారలకుఁ గూడఁ ? గుబేరుని మించు శ్రేష్ఠకుం
గుశలమె ? పౌరులెల్లరకుఁ గొల్లగనుండునె పాడిపంటలున్.

మఱియు,

గీ. ధనము నాసించి సజ్జనుల్ ధర్మవృత్తి
వీటిఁ బుచ్చక యుందురే విశ్వమందుఁ ?
జేయరాని పను లెవరుఁ జేయరుగద ?
నాల్గు పాదాల ధర్మంబు నడచుఁగాదె ?

జయ :—దేవా !

గీ. ఘనతరంబైన మీ పరాక్రమము విన్న
దుష్టులున్నను మానరా దుండగముల ?
నడవులను నాశమొనరించు చెడుమృగములు
చనవె పొదలకు సింహ గర్జనము విన్న ?

అశ్వ :—సచివాగ్రేసరా! నా మనంబున నింతవఱకు సంతోషంబనున దెట్టిదియు కాన్పింపకున్నది కదా!

జయ :-దేవా! సంతోషాయత్త చిత్తులరై యుండకుండుటకుఁ దను కేమి కొఱతఁ వాటిల్లె?

అశ్వ :—అమాత్యా! పుత్రోత్సవంబు నేత్రోత్సవంబుగాఁ గాంచు భాగ్యము నాకు లభింపదయ్యెఁ గదా!

జయ :—అది దైవాధీనము.

అశ్వ :—అకటా! అట్టివాని జన్మమేల? భోగమేల? సామ్రాజ్యమేల? గజతురంగ పదాతి సైన్య సంఘము లేల? అన్నియు నిష్ప్రయోజనములు గదా! ఏమంటివేని?

క. సావిత్రి యనెడు దేవిని
భావంబునఁ దలఁచి నంతఁ బ్రత్యక్షంబై
దేవి యొసంగిన పుత్రిక
సావిత్రియె కాని పుత్రి సంతతి కలదె?

అకటా! సుతసంతానంబు లేని లోపంబునఁ "బున్నామనరకంబునుండి తప్పించుకొననేర కధోగతులపాలై వంతలనొందుదురను నార్యోక్తి" వినమె?
మఱియు,

క. శ్రుతులందును స్మృతులందును
నితిహాసములందు మఱియు నితరములందున్
సుతసమితి లేని వారికి
గతులు గలుగవని నుడువుటఁ గాంచమె సచివా?

జయ :—దేవా! మీ రిట్లనేక విధంబుల వగవనేల? దైవానుగ్రహంబున్న నిఁక మీఁదఁ పుత్రులు గలుగరాదా? సుఖమనుభవింపరాదా? యశము నొందరాదా?

అశ్వ:—మంత్రీ! నీ వెంత బేలవు!

చ. అరయఁగ నాకుఁ జెల్లెఁగద యద్రిసుతేశకిఁ జేసినట్టి పూజల్
సరి! సరి!! యిప్పుడా పుత్రసంతతి గల్గుటదేటిమాట నీ
వెఱుఁగవె నాగరంబున నీకేల జనింపదు బిడ్డలక్కటా!
ధర లభియించు నెవ్వరికో దాననక్షైరి కటాక్షముండినన్.

జయ:—దేవా! భవిష్యద్వృత్తాంత మెవ్వఁడెఱుంగు? దైవవిధి యనుల్లంఘనీయము గదా!

అశ్వ:—సచివా! ఇందిరావల్లభునకు నాపై ననుగ్రహ ముండకపోవుటకుఁ గారణమేమి?

గీ. దేవ భూదేవ మాన్యముల్ దీయలేదు
గుళ్ళు గోపురములు చెడఁగొట్టలేదు
విధి విధాన సుకర్మల విడువలేదు
భూప్రజల నెప్డు దుఃఖాబ్ధి ముంపలేదు.

ఇదియునుంగాక,

ఉ. శ్రీవరు పాదపద్మముల సేవయొనర్చుచుఁగాని యెప్పుడే
నేనిధమైన కర్మముల నే నొనరించి యెఱుంగ నాకు నీ
భూవలయంబు నేలఁగల పుత్త్రకుఁ డొక్కఁడుఁ బుట్టనట్టిదా
నా విధికేమియందు నకటా! యజుప్రాంతకు లోపముండునే?

క. పుత్త్రుఁడె వంశోద్ధారుఁడు
పుత్త్రుఁడె సద్గతులకెల్ల మూలము మఱియుం
బుత్త్రుఁడె ధనధాన్యాదులుఁ
బుత్త్రుఁడె భూషణము ఘనము భూజనములకున్.

అనునార్యోక్తికిఁ దగినట్లు,

గి. పుత్త్రి సంతతి లేదంచు మూఁడువంక్తు
లను వరుసగా మదీయ ఫాలమునఁ దీర్చి
వ్రాసెఁ గాఁబోలుఁ బరమేష్ఠి పట్టుఁబట్టి
కాకపోయిన సుతులేల కలుగకుంద్రు?

ఇదంతయు నిట్లుండ,

మ. సుతసంతానము లేనివానిమొగముం జూడంగరాదంచు స
న్నుతి పాపుండని యెంచి త్రోయుదురుగాదా నిర్జరుల్ పూని, నా
గతి యిట్లై వికసించి కొంప్పటవయో కారుణ్యభావంబునన్
సుతభిక్షంబిడి మాన్పవాదు కలదే శోకంబు నాశంబుగన్.

మాళ:-హృదయేశ్వరా! మీరిట్లనేక విధంబుల దురపిల్లనేల? పూర్వ జన్మ సుకృత దుష్కృతములం బట్టియేకదా నరుండు సుఖ దుఃఖంబులనుభవించు చుండునని పెద్దలువచింతురు. అట్లే పూర్వజన్మంబున మనమేమైన సుకృతంబు లొనర్చియుంటిమేని మనకీలోపంబు తీఱఁగలదు. నాఁడు సావిత్రీదేవి ప్రసన్నయై మీకొక పుత్త్రికారత్నంబు గలుగునని చెప్పి చనుచున్న నంత నొక సుపుత్త్రి నొసంగుమని మరల మన మద్దేవిని ప్రార్థింప ముందు మీకుద్భవించు పుత్త్రికారత్నంబు వలన సుపుత్త్రులం బడయఁ గలుగుదు రని యానతిచ్చి చనియె! నదిమీరు మఱచితిరా యేమి ?

అశ్వ:-(స్మృతి నభినయించుచు) సరి! సరి!! నిజమే! మఱచితి. నాకి ప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది.

మాళ:-ప్రాణేశ్వరా! నేనొక విషయమునుగూర్చి మీతోఁ గొంత చెప్పఁదలఁచియుంటిని.

అశ్వ:-ఏమీ! నీవు చెప్పఁదలఁచుకొన్న విషయము రహస్యము కాదు గదా ?

మాళ:-రహస్యమేమున్నది. పదుగురు వినఁదగినదే ?

అశ్వ:-ఏదీ! చెప్పుము.

మాళ:-మనసావిత్రి వివాహయుక్తవయస్కయై యున్నదిగదా!

అశ్వ:-ఔను. ఐన ?

మాళ:-ఇంతవఱకు వివాహప్రయత్న మొనర్పనందుల కొకమారు మీకు జ్ఞప్తికిఁదెచ్చుటయేనామనవి.

అశ్వ:-ఔను! నేనును నేఁటప్రొద్దుననే చేయుచుంటిని. మఱచితి ననుకొంటివా యేమి? (అని యింతలో వంకఁజూచి) జయశీలా! సావిత్రికిఁ దగినవరుని విచారించుటకై పంపఁబడిన పురోహితులు వచ్చియుండిరేమో తెలియునా?

జయ:-దేవా! ఇంతవఱకు రాలేదు. నేఁటనో మాఁపటనో రావచ్చును.

అశ్వ:-అట్లయిన నీకీవృత్తాంత మెట్లు తెలిసినది?

జయ:-రాజేంద్రా! చెప్పెదను వినుఁడు. అంగ, వంగ, కళింగ, నేపాళాది సమస్తదేశంబులఁ బరికించి, పిమ్మటఁ గాశ్మీరక్షితితలేంద్రుని పట్టణంబునకుఁ జేరితిమను వృత్తాంతమును దెలియఁజేయు లేఖయొకటి వ్రాసియుండిరి.

అశ్వ:-మంచిది. ఇంతియేనా? ఇంకేమైన వ్రాసియుండిరా?

జయ:-దేవా! ఇటువినుఁడు; పిదపఁ దద్రాజ్యపరిపాలకుని మందిరంబున కరిగి విచారించితిమనియు, నారాజన్యున కొక్కఁడే పుత్త్రుండనియు, వారును దత్కుమారుని వివాహప్రయత్నములోనేయుండిరనియు, మేమారాకుమారుని వీక్షించి, పరీక్షించితిమనియు, నాబాలుఁడు మనకన్నివిధంబుల ననుకూలుఁడుగా నున్నాఁడనియు, బయలుదేఱుచుంటిమనియు, మొదలుగాఁగల సంగతులనుగూడ వివరించియుండిరి.

అశ్వ:-అట్లయిన మనమిప్పుడు వివాహప్రయత్నము చేయవచ్చునా?

జయ:-చేయవచ్చును; గాని యింతలో మించిపోయిన దేమున్నది! పురోహితుల రానిండు.

మాళ:-హృదయేశ్వరా! పురోహితులు విచారించివచ్చిన బాలుని మన సావిత్రి వివాహమాడు నటుల నాకుఁ దోఁచదు.

అశ్వ:-సఖీ! మనకనుకూలమైనవాని నుద్వాహమాడదనియా చెప్పుచుంటివి! అటులయిన నీవేమియు నుపదేశించి రాలేదుగదా!

జంబునారలకు మొదటినుండియు సన్నపాటివాఁడే. ఇంకఁ క్రొత్తేమున్నది. ఏమంటివేని,

గీ. మగనికనుకూలమైన యేమగువనైనఁ
జులకనగఁ జూచుటయొకాక సుదతులెపుడు
పిల్లకాయల మనసెల్ల బెదరఁగొట్టి
వలదనుమనుటయుఁ గూడఁ గలదుకొంత.

అట్లే నీవేమైన బోధించి వచ్చితివేమోయని నాకనుమానము గలుగుచున్నది.

మాళ :—హృదయేశ్వరా ! మీరిట్లనుచుండ నేనేమి చెప్పఁగలను. ఇంచుక స్మృతికిఁ దెచ్చుకొంటిరేని మీకే స్పష్టముకాఁగలదు.

అశ్వ :—(ఆలోచించి, తనలో) ఆఁ! సరి! సరి!! జ్ఞాపకమునకువచ్చినది. నేనొకనాఁడు గారాబుపట్టియగు సావిత్రిని జేరఁబిలిచి "అమ్మా! నీకనుకూలమైన రాజపుత్త్రునెవనినైన వరియింపు" మని చెప్పియుంటిని. నాఁడు నేనాడినమాటనుబట్టి నేఁడా బాలికా రత్నమెవనినైన వరియించియుండవలెను, నిందబద్ధమేమియు లేదని నాకిప్పుడు చక్కఁగాఁ దేటపడినది. అయిన నీమెనడిగి కొంత తెలిసికొనియెద. (అని భార్యవంకఁజూచి) హృదయేశ్వరీ! సావిత్రి వైవాహికవిషయమై నీతోనేమైనఁ జెప్పియుండెనా?

మాళ :—చెప్పియేయున్నది.

అశ్వ :—ఏమని ?

మాళ :—చెప్పెదను. వినుఁడు. సావిత్రి తాను గురుశుశ్రూషకుఁ బోయెడు తెరువున నొకసుందరాంగుని జూచితిననియు, నాతఁడే, తనకన్నివిధముల ననుకూలుఁడైన వాఁడనియుఁ దమకీసంగతి నెఱింగింపుమని.

అశ్వ :—అట్లయిన నాబాలుని దేశనామధేయాదు లేమైయుండునో తెలియునా ?

మాళ :— తన గుఢచారులవలన సాళ్వదేశాధిపతియగు ద్యుమత్సేనుని పుత్రుండు సత్యవంతుండని వినియుంటినని చెప్పియున్నది.

అశ్వ :—ఇంకేమైనఁ జెప్పియుండెనా ?

మాళ :—లేదు.

అశ్వ :—సరే! నీవింకనంతిపురంబున కరుగుము. సేనాబాలుని వృత్తాంత మామూలాగ్రము తెలిసికొనివచ్చెద.

మాళ :—దేవా! సెలవు. (నిష్క్రమించును)

జయ :—దేవా! మనమిదివఱకు వరాన్వేషణమునకై పంపిన పురోహితు లిదేవచ్చుచున్నారు.

(అంత నిరువురు బ్రాహ్మణులు ప్రవేశింతురు).

అశ్వ :—(లేచి) భూదేవతలారా! వందనంబాచరించు చున్నాఁడను. (నమస్కరించును)

బ్రాహ్మ :—జయమగుఁగాక! జయమగుఁగాక!..

అశ్వ :—మీరలాపీఠముల నలంకరింపుఁడు.

బ్రాహ్మ :—(పీఠములమీఁదఁ గూర్చుందురు)

అశ్వ :—(కూర్చుండి) బ్రాహ్మణోత్తములారా! మీక్షేమసమాచారం బులు చెప్పఁగోరెదను.

బ్రాహ్మ :—రాజా! దైవానుగ్రహమువల్లను, మీకృపవల్లను, నేఁటి యింతవఱకు సుఖంబుగనే యున్నారము.

అశ్వ :—పురోహితులారా! సావిత్రికిఁదగిన వరునెందైన విచారించి వచ్చినవారలేకదా ?

బ్రాహ్మ :చిత్తము! మేమిప్పటికి సుమారు నాలుగు మాసంబుల క్రిందటఁ దమయనుజ్ఞప్రకారము బయలుదేఱి సమస్తదేశంబులు దిరిగి, తిరిగి మాకేచ్చటను దగిన బాలుండు గన్పింపమి నెట్ట కేలకుఁ గాశ్మీరదేశాధీశుని పట్టణంబునకుంజని విచారింపఁగా నారాజన్య కుమారుఁడుమాత్రము మనకనుకూలుఁడుగావచ్చు ననుకొని యచటనుండి బయలుదేఱి యీదినంబున నీపురంబు నకుఁజేరితిమి.

అశ్వ:—సచివా! వారు చెప్పిన దంతయు నిదివఱకే వినియుంటిమి. ఇందుఁ గ్రొత్త లేమియును లేవు. అయినను బురోహితులు విచారించి వచ్చిన వరుని వివాహమాడవని యింతకుముందు నా దేవి వల్ల వినియుంటిమిగదా!

ఇప్పుడు,

క. బాలామణి వరియించిన
బాలుని వృత్తాంత మరయ వలయును జవిత్రా
మేలిలఁ దెలియనగునో
యాలోచన సేయుమయ్య యతిశీఘ్రమునన్.

(అందఱు నిష్క్రమింతురు)

[తెరపడును]

## ద్వితీయరంగము

(నారద మహర్షి ఈ క్రింది పద్యములతోఁ బ్రవేశించును)

నార:—

ఉ. శ్రీలోలుఁడ ద్విజారవముచేఁ ద్రిదివంబు నలంకరించి స
చ్ఛీలత సర్వప్రాణుల వశీకృతులం బొనరించి లోకముల్
పాలన సేయుచుం గుమత పార్థివ కోటుల సంహరించు గో
పాలుని పాదపద్మములు భక్తిగ భజించెద మానసంబునన్.

శ్రీమన్నారాయణుని లీలావతారంబుల మహిమ యిట్టిదని వర్ణింప నెవ్వఁడోపు!

మ. అనిశం బీశ్వరు పాదపంకజములన్ ధ్యానించుచున్ దాంతులై
వనమందు న్నివసించి యాకలములన్ భక్షించు బెట్టెట్టులో
దినముల్వెచ్చెదు మానిపుంగవుల నేదివ్యస్వరూపంబు పా
వనులం జేసెను దానినెంచెదను! దేవా చెన్నకేశప్రభూ!

మఱియు,

గీ. జగమనందగు యవనిక సంతరించి
మర్త్యులనియెడు తోలుబొమ్మలను నిలిపి
నాటకంబుల నాడించు నర్తకుండ
వీవెకద యాదిదేవుండ! యీశ్వరుండ!

గీ. ఒకటి రెండైన వైరంబు లున్నఁగాని
కలుగ దుత్సాహ మెవుడు నాకిలను నటులె
కడచుచున్నవి దినములు కలవులేక
ముందు సంగతి తోఁచ దేమందు నింక.

ఆహా! ఈ పురంబెంత రామణీయకమై కన్పట్టుచున్నది.

సీ. ఒకచాయ సద్విజ ప్రకరంబు వల్లించు
వేదశాస్త్రాది నిర్హ్రాదవితతి
యొకవంక వివిధ నాటక రచనా సమ
ర్థులగు కవిశిఖామణులగణంబు
నొకచోట సురవంద్యు నుర్వీశు సర్వేశు
స్మరియించు భక్తుల సంచయంబు
నొకయిక్క వెలయాంధ్ర నికరంబు నేర్చెదు
నానావిధోదీర్ణ నర్తనంబు

గీ. లౌర బాజారు లందమేమనఁగ వచ్చు
మఱియు నిద్దాని వర్ణింపఁ దరమె తమ్మి
చూలికైనను శ్రీవనమాలికైన
వేడుకల కిమ్మ మద్రభూ విభు పురమ్ము.

నే నిదేపోయి యశ్వపతిం గలిసికొనియెద.

(అని నిష్క్రమించును) [తెరపడును]

## తృతీయ రంగము

(అశ్వపతి, జయశీలుఁడు, పీఠములమీఁదఁ గూర్చుండి యుందురు.)
(తెర యెత్తఁబడును) (అంత భద్రుఁడు ప్రవేశించును.)

భద్రు:—మహాప్రభూ! ఎవ్వరో యొక మహనీయుఁడు మూఁడెడు మీసంబులును, బారెఁడు గడ్డంబును, దెగ బారెఁడు జడలునుం గలిగి చూపరులకు వెఱపు గొలుప తంబుర మీటుకొనుచు ద్వారంబునం దనుదర్శనాభిలాషియై వేచియున్నవాఁడు.

అశ్వ:—(ఆతురతతోఁ) భద్రుఁడా! వారి నీవేమి యని యడిగితివా?

భద్రు:—దేవా! నేనేమియు ననలేదు; కాని నా కేకొంతజడుపు కలిగినది.

అశ్వ:—నీ విప్పుడు శీఘ్రగతిఁ జని వారినిటకుఁ దోడ్కొని రమ్ము.

భద్రు:—చిత్తము! (అని నిష్క్రమించి తిరిగి నారద మహర్షితోఁ బ్రవేశించును.)

అశ్వ:—(లేచి) దేవా! వందనంబాచరించు చున్నాఁడ. మీ రాపీఠం బలంకరింపుఁడు

నార:—ఆయుష్మాన్ భవ! (అని పీఠముమీఁదఁ గూర్చుండును)

అశ్వ:—ఋషీశ్వరా!

ఉ. తావకదర్శనంబునను ధన్యుఁడనైతిని, మద్గృహంబునుం
బావనమయ్యె, మీవిమల పాదములన్నిలుపంగ దేవ! మ
ద్భావముపల్లవించెఁగృత పాపచయంబులువీడె సత్కృపం
బ్రోవుఁడు సర్వకాలమిదె పుణ్యచరిత్ర! జోహరొనర్చెదన్.

నార:—రాజా! నీభక్తియెంతశ్లాఘనీయము! ఏమంటివేని మాబోఁటి ఋషీశ్వరులెల్ల, మీవంటి రాజపుంగవు లుండుట చేతనేకదా! కృతార్థులగుటకుఁ గారణంబులు.

అశ్వ:—మానిచంద్రమా! వమిట్లంటిరి. మీరింతగా శ్లాఘింప వలయునా! మీకరుణామృత సారముఁ గ్రోలియేకదా మేమెంతయుఁ దరింపఁ గలిగినది.

నార:—నృపకులతిలకా! నేనిప్పు డపహసించితి ననుకొంటివా యేమి! కాదు! కాదు!! నామనోనిశ్చయమును జెప్పెదను వినుము. ఎవ్వఁడేని నిష్ఠాగరిష్ఠుండై, యేకాకియై మహారణ్యమధ్యంబున నేకచిత్తంబునఁ, దపస్సమాధిఁ గూర్చున్నయెడ, సింహశార్దూ

లాది క్రూరమృగంబుల బాధకలుగకుండుటకెల్ల మీాకరంబులం
దాల్చు చంద్రకాంతాది మణుల ధిక్కరింపఁగలుగు నిశితాస్త్ర
శస్త్రపరంపరలే కదా! రక్షకములు? ఒకవేళ నట్టివే లేనిచో
నే క్రూరమృగంబుల వాతఁబడి ప్రారంభముననే మృతి
నొందవలసినవాఁడగును. మీారాజంతువులను సంహరించుట
కొఱకే కదా! యప్పుడప్పుడు వేటనుండజనెడు ముఖ్యోద్దేశ్యము.
దానం జేసియే ఋషీశ్వరులకెల్ల మరలఁ బ్రాణదానంబులు
చేసినవారగుచుందురు. కాఁబట్టి మీారెంతయు గౌరవార్హులు.
మేమెంతయుఁ గృతార్థులము. ఇంతియే కాని నామనంబున
వేఱొండేమియు లేదు. సంకోచింపకుఁడు.

అశ్వ:-నా కణుమాత్రమైనను సందియము లేదు.

నార:-రాజా! సౌభాగ్యవతియగు నీ యనుంగు కూఁతురు సావిత్రికి
వివాహ మొనర్చి యుంటివా?

అశ్వ:-మీాకుఁ దెలియఁ జేయుచున్నది? నా కుమారీరత్నం బిదివఱ
కొక రాకొమరుని వరియించి యుండెననియు, నాతని పేరు
సత్యవంతుడనియు నా దేవీ మూలమున నే నింతకుముందే
విని యుంటిని. అయినను, మంచి చెడ్డలు ముందుగఁ దెలిసి
కొనవలయును గదా! మీా రాబాలుని వృత్తాంత మామూలా
గ్రముగ నెఱింగింప వేఁడెదను.

నార:-రాజా! అందుల కభ్యంతర మేమున్నది. చెప్పెదను వినుము.

చ. అతులిత కీర్తిశాలి సుగుణాఢ్యుఁడు సత్యపథానువర్తి భూ
పతులకు మేటి విద్యలకు, భవ్యచరిత్రుఁడు శౌర్యశాలి సూ
వితత మనోజ్ఞమూర్తి బహు విశ్వసనీయుఁడు సత్యవంతుఁడో
క్షితివర! చెప్పనేలమఱి చిన్నెలువన్నెలు పెక్కులుండఁగన్.

మఱియు,

క. చక్కదనంబునఁ గంతుని
జక్కవ కనవిప్ప నగలు సమరంబుననో
చక్కడఁచు రిపులఁ గ్రుంటిలోఁ
బెక్కులువచియింపనేల విశ్వాధిపతీ!

సీ. ధర్మానువర్తియై తనయుండునే కాని
దుర్మార్గపదకేఁ బోఁడు వెఱచు
శాస్త్రంబులెవ్వడఁ జదువఁబూను నె కాని
యుపహాస్యసంగతు లాడ వెఱచు
వర్ణాశ్రమాచార వర్తనలనె కాని
చెడుకార్యచయములఁ జేయ వెఱచు
సత్యప్రవర్తనస్సంచరించునె కాని
మృషభాషీకంబు ద్రొక్క వెఱచు
గీ. భూతములనెల్లఁ దనమాడ్కి బుద్ధియందుఁ
దలఁచునే కాని వేఱుగాఁ దలఁప వెఱచు
భక్తిచేనుండునే కాని పరమపురుషు
పదములను మానసముఁ జేసి పలుక వెఱచు.

సాళ్వదేశాధీశ్వరుండగు ద్యుమత్సేనుని సూనుండు. యశః
కాముండు.

అశ్వ :-మునీంద్రా! ద్యుమత్సేనాదు లిప్పుడెందున్నవారలు ?

నార :-(వినియు, వినని చుట్లునటించును)

అశ్వ :-స్వామీ! ఏమిట్లూరకుంటిరి ?

నార :-పెద్దకాలంబు రాజ్యంబును పాలించి పిమ్మట వృద్ధాప్యంబున శత్రువులచేఁ బురమునుండి వెడలఁగొట్టఁబడి భార్యాసుతసమేతంబుగావచ్చి యీసమీపారణ్యంబునఁ దపంబాచరించుకొనుచున్నవాఁడు.

అశ్వ :-ఎంతకష్టమెంతకష్టము!

నార :-మఱచితి! ఇంకొక్కటివినుము.

చ. జనవర! శాళ్వశాళ్వసుఁ గ సందియమొందు మదీయమానసం
బునఁబొడఁగట్టుచున్నదది భూరివిషాదము నొందఁజేయు నే
మనివచియించెదం బరిణయంబయినంతనె వత్సరాని క
య్యనఘుఁడు సత్యవంతుఁ డకటా మృతినొందును ఘోరదుర్విధిన్.

అశ్వ :-అక్కటా! ఎంతఘోర మెంతఘోరము!

(అంత సావిత్రి ప్రవేశించును)

సావి :-మునీంద్రా! అభివందనములు. (నమస్కరించును)

నార :-దీర్ఘసుమంగలీభవ !

అశ్వ :-అమ్మా! ఇటు రమ్ము. (దగ్గరకుఁదీసికొని) నీవొక రాకుమారుని వరించియుంటివనియు, నతని పేరు సత్యవంతుండనియు, నీజననివలన నేనింతకుమున్ను వినియుంటిని. అది మొదలు ముందుగా మంచి చెడ్డలు తెలిసికొన వలయునుగదా! యనియత్నించుచుంటిని. ఇంతలో నీమునీంద్రుని రాకవలన మదీయ జన్మతరించుటయే గాక సత్యవంతుని వృత్తాంతమంతయుఁ దెలిసికొనఁగలిగితిని. కాని యనేక లోపంబులుండుటంబట్టి నామనం బెంతయు నొవ్వ కున్నయది.

సావి :-నాయనా! లోపంబులు లేనివారెవరు?

అశ్వ :-అమ్మా! కూటికినిగుడ్డకును లేకపోవుటకంటె నింకొకగొప్ప లోపమేమున్నది?

సావి :-తండ్రీ! రాకొమరుండై నచో దినుటకన్నము లేకెట్లుండును?

అశ్వ :-రాజ్యభ్రష్టుండై వనంబుననివసించువాని కెట్లులభింపఁగలదు?

సావి :-జనకా! ఇటువినుము.

గీ. అతివ యత్తింటికేఁగిన యదనుకొలఁది
భాగ్యమేమియును లేకున్నఁ బడయవచ్చు
[illegible]
గలిమిలేములు గావడి ఘటములనరె?

అశ్వ :–అమ్మా! అవియెట్టులున్నను నాబాలుండు వివాహంబైనయొక సంవత్సరమునకు మృతినొందునని కూడ ఋషీశ్వరులు వచించియుండిరి.

సావి :–జనకా! భవిష్యత్తునుగుఱించి యెవ్వరుచెప్పఁగలరు? జ్యోతిషమునకు పార్వతీదేవి శాపమున్నదికదా!

నార :–అమ్మా! సావిత్రీ! అట్లెన్నఁడుఁబలుకఁబోకుము.

ఆ.వె. పెక్కుపలుకు లేల పెండ్లాడనలదమ్మ
నిక్కువమ్ము నమ్ము నీరజాక్షి
సత్యవంతుఁడొక్క సంవత్సరంబున
కంతమొందుఁ బెండ్లియైన వెనుక.

అశ్వ :–అమ్మా! నీమనంబున కిప్పుడైనను స్పష్టపడినదా? ఈ ఋషీశ్వరుండెఱుంగని విషయంబులీపదునాల్గు భువనంబులను లేవనుట జగద్విదితము నీవీమునీంద్రుని మాటఁదిరస్కరింపకుము. వేఱొకరాకొమరుని వరించిసుఖంబొందుము.

సావి :–తండ్రీ! మనోవాక్కాయములనునవి త్రివిధంబులు. అందు మనంబు ప్రధానమైనది. అట్టిమనంబునఁ గైకొన్నవానిని గాదని వేఱొకని వరించుట న్యాయమే? మీరెఱుంగనిధర్మంబులుగలవే? నేనింతగాఁ జెప్పనలయునా? ఎట్లైననునన కే నన్నాసత్యవంతునకే యొసంగుఁడు.

నార :-సావిత్రీ?

కం. జనదాఁటకమ్మ యెప్పుడు
భువిఁబెద్దలమాటలకును భూరివివేకం
బవమానమెల్లఁబొందెద
నవినయమత మేలమాను మమ్మాయిపుడున్.

ఆ. వె. కోపమూనకమ్మ గూడదు; జనకుని
మాటవినుము దాన మంచియగును;
"తెలిసికలియరాదు కలిసితెలియరా"ద
టంచుపెద్దలాడు రైనవినవె!

ఇదియునుం గాక,

మ. వలదంచుం బలుమాఱు తేల ఋషియు న్వాక్రుచ్చెనంచిప్పుడో
నెలతా! కోపమునొందఁబోకుమిఁకయు న్నీమేలుకేకాని నా
కులభించంగల దేది లేదు, విను లోకుల్మెత్తురే నిన్ను భూ
వలయంబేలెడు రాకొమారు వరియింపన్బుద్ధిఁద్రిప్పందగున్.

సావి :-ఋషిచంద్రమా! మీరింతగా బోధింపవలయునా? మీరెఱుం
గని దేమున్నది? దైవవిధి దాఁటనెవరితరము?

అశ్వ :-మునీంద్రా! మీరెంతబోధించినను, నేనెంతచెప్పినను, విననొల్లని
నీబాల నేమనవచ్చు! అక్కటా! పురుషసంతానము లేని
లోపంబుననే మిగుల వగలఁబొగులుచుంటి. లేక లేక యీబిడ్డ
గలుగ నెంతొ ఘనంబుగ వివాహమొనర్చి సంతసింతమనుకొంటి,
నాపాటియదృష్టము నాకు లేదుకాఁబోలు?

నార :-రాజా! నీకొమారిత తలంపు మానుపఁ గడు దుర్లభంబుగాఁ
దోఁచుచున్నయది. కావున! ఎటులైననుసరే! నీవాద్యుమత్సే
నుని కొమారునికొసంగి, వివాహమొనర్పుము. ఒకవేళ నీబాల
పుణ్యవశంబున నాబాలుండు చిరాయురుపేతుఁడగునేమో?
ఎవరుచెప్పఁగలరు?

అశ్వ:—ఋషిచంద్రమా! ఎటులైననుసరే! తమయాజ్ఞ శిరసా వహించెద.

నార:—రాజా! నే నిదే పోవుచున్నాఁడ. (నిష్క్రమించును)

అశ్వ:—మంత్రీ! జయశీలా! మనపురంబున కనతిదూరంబున నున్న యరణ్యంబునఁ గదా! ద్యుమత్సేనాదులున్నారని వినియుంటిమి, పురం బలంకరింప నియమింపుము. పురోహితులం బిలిపించి లగ్ననిశ్చయము చేయించుము. సావిత్రిని దోడ్కొని వనంబున కరిగి వివాహ మొనర్చెదము.

జయ:—దేవా! చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

(తెరపడును)

ద్వితీయాంకము సంపూర్ణము.



శ్రీరస్తు

# సావిత్రీ సత్యవంతీయము

## తృతీయాంకము

---

(అరణ్యామునం దొక వటవృక్షము క్రింద నిలువంబడి ద్యుమత్సేనుఁడు, భానుమతి, సత్యవంతుఁడు, నుందురు.)

(తెర యెత్తఁబడును)

ద్యుమ :- (తనలో)

ఉ. శ్రీ రమణీయమై ప్రథిత స్నిగ్ధయశఃప్రముదంబునై సదా
భూరి సుఖాల వాలమయి ప్రాజ్యతఁ గాంచిన సాళ్వదేశ మా
పోరక గెల్పునేగొను సుబుద్ధుల మమ్ములఁ బాసియుంటివా?
చేరక పోవ మెన్నఁటికి శ్రీవరి సత్కృపయున్న క్షేమనుల్.

అకటా! వందిమాగధులు కైవారంబు సేయుచుండ, భటాళి ద్వారంబున వేచియుండ, సుబుద్ధి మొదలుగాఁగల సచివాగ్రేసరులు రాజకీయ వ్యవహారంబులు ముచ్చటించుచుండ, విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ, ద్విజాశీర్వాదంబే సకల కల్యాణంబుల కాటపట్టువైయుండ, బాడబుల కగ్రహారాద్యనేక దానంబు లొసంగుచుఁ, గవి, గాయక, మాంత్రిక, విద్యామనీషుల యథోచిత పారితోషికంబుల సన్మానించుచు, యాచకావళి సంరక్షణార్థం బనవరతం బన్న దానంబుసేయుచు, రాష్ట్రీయ ప్రజల సౌఖ్యార్థమై యెక్కుడు శ్రద్ధవహించుచుఁ, గుజన శిక్షణయు, సుజన రక్షణయుఁ, జేయుచుఁ, బేరోలగంబున, నిరుపమానంద స్వాంతుండనైయుండు నేను, దిక్కుమాలి, దారా

పుత్త్రి సమేతంబుగ, నీ ఘోరారణ్య మధ్యంబున, నివసింప నొప్పుదునని స్వప్నావస్థయందైనను దలంచి యెఱుంగనే? అకటకటా! దురంతములైన దుఃఖంబు లనుభవింపంగల దినంబు లెంతలో వచ్చినవి! మఱియును నీ వనవాస క్లేశంబు సంభవించుట యెల్ల దుర్మార్గవర్తనుండగు విజయసింహుని రక్షించినందువల్లనే కదా! "ఉపకారమునకు బోని కెప్పుడు నపకారమే వెనువెంటఁ దగిలి వచ్చుచుండు" నను పెద్దల పలుకు లసత్యంబులుగా నేర్చునే! ఏలయన?

గీ. చిన్న తనమున నుండి పెంచినను గాని
కఱవకుండునె వ్యాళము కరుణమాలి?
చెడిపోవునకు హితంబు సేయువెల్లఁ
దనను గట్టనుద్రాళ్ళు తాఁగొనినయట్లు.

(భార్యపైఁ జేయివైచి) శుద్ధాంత కాంతాజనం బనవరతంబు సేవింప, నంతిపురం బలంకరించి యుండు నీ రామామణి,

సీ. నడచి యెఱుంగదు నవపల్లవ శ్రేణి
తెరువుపైఁ గాని యీ సురభిగాత్రి
చెవిఁ జేర్చి యెఱుఁగదు చిలుక కదుపుల ను
స్వనముకే కాని యీ చంచలాక్షి
కేలుంచి యెఱుఁగదు మాలతీకుసుమ సం
తతులనె కాని యీ తలిరుఁబోఁడి
పాడఁగని యెఱుఁగదు పుణ్యనదీక్షేత్ర
బృందమే కాని యీ కుందరదన

గీ. అట్టిసుకుమారి యలివేణి యలసగమన
యడుగు వెట్టఁగరాని యీ యడవులందు
నెటుల నడువంగ నోపు నీ యెడను? నకట!
బ్రహ్మ లిఖితము దప్ప నెవ్వారికైన!

వెండియు,

సీ. శంకరాభరణము న్వంచరింపఁగనీయ
దలివేణి వదనంపు దళుకు ముందు
కీరవాణుల మాటఁ గీర్తింపఁగా నీదు
ప్రమదా సువాక్సుధారసము ముందు
సింహేంద్ర మధ్యము జెప్పఁగా రానీదు
నవలా యలంతి నెన్నడుము ముందు
శ్రీరాగమును గూడఁ జెంతనుండఁగ నీదు
వనజాక్షి సుగుణ సంపదకు ముందు
గీ. భూపతులు మెచ్చనత్తింట భోగభాగ్య
ములను దులఁదూఁగఁగా నెప్పు పుణ్యమెడసి
కన్నడలె నిన్ను వరియించి క్రాలుచుండె
దివ్యగుణధామ పుణ్య సతీలలామ!

మ. వరరాడ్వంశమునం జనించి సతివై బాల్యంబు నందుండి యీ
వటుకుం గానవు ఘోరదుర్గవనముల్ భామామణీ! యింక నే
వరుస న్గాంతువొ? పెక్కు కష్టములకుం బాల్సేసి నీ భర్త యీ
వరుసం ద్రిప్పునటంచు నెంచవుగదా! ప్రాణేశ్వరీ! యెన్నఁడున్.

కట్టా! వనవాసంబే కాక, వెండియు నీ సౌభాగ్యవతి కెంత
లెంతటి బీదకళలు దెచ్చిపెట్టితి.

సీ. పట్టు చేలంబులు గట్టెడు నెలనాగ
కాషాయ వసనముల్ గట్టవలసె
సౌధంపు మెట్లెక్కి జాగుసేసెడు లేమ
మిట్టపల్లంబుల మెలఁగవలసెఁ
జంద్రిక యందేని సంచరింపనినారి
యెండకాకకు నోర్చి యుండవలసెఁ
బసిఁడి యుయ్యెలలందుఁ బవ్వళించెడు తామ
నేలపై నిదురింప నేర్వవలసెఁ

గీ. బాలకోటుల విహరించు పూవుఁబోఁడి
ప్రబల భల్లూక శార్దూల రావములకు
దిక్కు లద్రువంగ భీతిచేఁ బిక్కటిల్లు
వనము లోపల విహరింప వలసె నకట!

ఇదియునుం గాక,

మ. జననంబొందిన దాది సుదతి! నీ శ్వశ్రూజనంబెంచి నీ
జనకుండే విధిఁ బెంచి నాఁడొ గద! యాత్మజానికిల్లాలివై
ఘనదుర్గాంత వనాంతసీమల నెటో కాలంబుఁ బుచ్చంగ నా
నని డెందంబుల నెంతురే జటులహో యీ బాలగోపాలమున్.

ఏల యనుకొందురు?

ఉ. ముప్పది మూఁడుకోట్ల సురముఖ్యులు సాక్షిగఁ బెండ్లియాడి యే
ముప్పులపాలు సేయనని పుణ్యజనంబుల మ్రోలఁబల్కియుం
దిప్పలు పెట్టినట్టిదుఁ దెంపరి వీఁడని కాలుఁడక్కటా!
తప్పును మోపి నా పయిని దండన సేయక యూరకుండునే?

ఇది యంతయు నిటులుండ,

గీ. అమలమణిమయ సౌధంబు లందు మెలఁగు
మచ్చెకంటిరో! నీ విట్లు మగనితోడఁ
గందమూలాదులను దినఁగలుగుదువని
తలఁపనెన్నఁడుఁ గలనైన దైవసాక్షి.

మఱియు నో కాంతామణీ!

గీ. భల్లహర్యక్షబలిముఖ వ్యాఘ్రసమితి
యతిభయంకర రవములం దందుఁ జేయఁ
జిలుక పలుకులు వినినంత నులికిపడెడు
చంచలాక్షిరో! నీ వెట్లు సైపఁగలవు!

భాను:—హృదయేశ్వరా! మీ రిట్లనేక విధంబుల దైన్యాక్రాంత
హృదయులై వగవనేల? పూర్వజన్మ సంచితార్థ ఫలంబనుభ
వింపక తప్పునే! ఏలయన?

గీ. అరయ నే నెంత దాననో యనఘచరిత!
యుగ్రవనవాసమును జేసి యుండ లేదె
చంద్రమతి, దమయంతి, వాసవుని సతియు
బ్రహ్మలిఖితంబు దాట నెవ్వారి వశము.

ద్యుమ:– హృదయేశ్వరీ! నీ విషయంబున నించుక శాంతించినను, నవమన్మథాకారుని డంబువిడంబించు కుమారుని వదనారవింద లావణ్యంబు దలంపునకు వచ్చుచున్న కొలంది, కన్నీరు మున్నీరుగాఁ గారుచున్నయది. ఏమంటివేని!

గీ. చారుతరభూషణంబుల సమితి దనర
దివ్యమణి హారబృందంబు తేజమంద
జాళువాడోలికలను నుయ్యాలలూఁగు
పరమసౌఖ్యంబు లెఱ్ఱంగి మఱచుఁ గొడుకు!

(సత్యవంతునిపైఁ జెయివైచు) నాయనా! సత్యవంతా!

మ. చతురంబోధిపరీతమై యొసఁగు నీ ధాత్రీమండలంబెల్ల నీ
వతిసౌఖ్యంబుగ నేలఁజాలుదు వటంచ శ్రాంతమే నెమ్మది
న్మితవృప్పారఁగ నెంచుచుంటి నిపుడిట్లీచందమౌనంచు నో
సుత! డెందంబున నెంచ లేదెపు డయో శోకంబుబాధించెడుఁ.

గీ. వంగడీంద్రుడతో మెలఁగెడు సౌఖ్యపంబుఁ
బాసి వనభూములందు నివాసమింక
నెటులఁ జేయంగ నోపుదు వింతవఱకుఁ
గనియెఱుంగవు దుర్గమ కాననములు

ఇదియునుంగాక,

సీ. చంద్రకాంతోపలస్థలిఁ జరించెడి నీవు
ఘోరాటవులఁగస్తి కుడుచుటెట్లు?
సాటిబాలురఁగూడి యాటలాడెడి నీవు
పాముబోతులఁగూడి యాడుటెట్లు?

భర్మ నిర్మిత హర్మ్య పంక్తిఁ జూచెడి నీవు
సొబగుఁ బాసిన పొదల్ చూచు టెట్లు ?
ధరణీసురులఁ గాంచి దండ మిడెడు నీవు
శిలలకు జోహారు సేయుటెట్లు ?

గీ. అకట ! హరిహరులకునైన నజునకైన
ననుభవింపక తప్పరాదనుట నిజము
గాకపోయిన నీవిట్లు కాననమున
నుండకుండుటె సాధ్యమై యుండుఁగాదె.

తండ్రీ ! సత్యవంతా !

గీ. పెరుఁగు మీఁగడ పాలతోఁ బెరుఁగునట్టి
తనయ ! కడగండ్లపాల్సేసి దయయుఁ బాసి
కాయగూరలఁ దినిపించు ఖలుఁడ నకట !
బ్రతికియుండియు జచ్చిన వాఁడ నిపుడు.

సత్య :—నాయనా ! ఇందు నీ వొనర్చిన దేమున్నది ? ఏ కాలంబున కేది సంప్రాప్తము కాఁగలదో యది సంభవ మగుచుండును గదా ! ఇంతకు దైవవిధి యనుభవనీయము గదా ! నీ విట్లేల దూషించుకొనియెదు ?

సీ. అతి బలశాలియగా యమరేశ్వరుఁడు మున్ను
వసియింపఁడే ఘోర వనములందు
సత్యశీలుఁడు హరిశ్చంద్ర భూపాలుఁడు
వసియింపఁడే ఘోర వనములందు
నిత్యసూనృతవాది నిషధేశ్వరుఁడు మున్ను
వసియింపఁడే ఘోరవనములందు
తురగ శరీరంబుతోఁ బద్మబంధుండు
వసియింపఁడే ఘోరవనములందు

గీ. నంతలంతటి వారి కావంతయైనఁ
దప్పనేవంత ? మన కెట్లు తప్పునయ్య ?

సర్వజగముల బాలించు చక్రవర్తి నేఁ
గొఱత యుండకపోవ నే కొఱతినైన ?

భాను:— నాయనా ! సత్యవంతా ! షోడశకళాపరిపూర్ణుండగు కుముద బాంధవునిం బోలు నీ ముద్దుమోము గన్నులారఁ గాంచుచున్న కొలందిఁ బట్టరాని దుఃఖంబున మునుంగుచుంటి. అక్కటా ! తండ్రీ ! నీ కిప్పుడెంత దీనదశ ననుభవింప వలసివచ్చె !

సీ. చక్కెర నిరతంబు చవిఁజూచు వానికా
రుచిలేని దుంపలు రుచ్యములగుట
హంసతూలికపాన్పు నందుండువానికా
చట్టాఱినేల శయ్యయగుట
నవరత్నఖచితాసనంబెక్కు వానికా
గ్రావపంక్తులు పీఠరాజియగుట
సర్వసర్వంసహా చక్రంబు బాలించు
వానికా యివి యుక్కుపట్టులగుట

గీ. ఎట్టినోము నోచితినొక్కొ యేనుమున్ను
బంధు జనములఁబాసి యీ వనమునందు
నిట్టిదశ నీకుఁగల్గునం చెంచనెపుడు
సకల సద్గుణవంత ! యో సత్యవంత !

సత్య:— అమ్మా ! నీ వెంత వెఱ్ఱిదానవు !

క. పైయుగముల వారెల్లరుఁ
గాయమును దొఱంగి కీర్తి కాంతను వెంటం
బాయక కొనిపోఁగలుగుట
కే మొండల కా గొడుగని యెంచియుఁ గాదె ?

ద్యుమ:— తండ్రీ! సత్యవంతా ! బాలుండవయ్యు నెంతటి నీతులను గఱపుచుంటివి.

సత్య:— నాయనా ! నేను మీకు నీతులను బోధించునంతటి వాఁడనా! కాకపోయినను గతంబును గుఱించి వగచిన నేమిప్రయోజనము!

నీవా సర్వాంతర్యామియగు శ్రీమన్నారాయణుని దివ్యచరణార
విందంబులఁ గూర్చి తపం బాచరింపుము. దానివల్ల మనకు
సర్వవిధంబుల మేలొనఁగూడఁ గలదు.

ద్యుమ:- ధీమంతా! సత్యవంతా! నీ వన్నట్లు గతించినదానికై
దుఃఖించినఁ బ్రయోజనము లేదని నాకిప్పుడు స్పష్టపడినది.
నే నొకప్పుడా యిందిరారమణుని మఱచితినా? మఱచియే
యుండ లేదు. అయినను జ్ఞప్తికిఁ దెచ్చితివి. నీవును నీజననియుఁ
బర్ణశాలకుం జనుఁడు. నేనిదే యా పరమేశ్వరుని గూర్చి
తపంబొనర్చెద.

(అందఱు నిష్క్రమింతురు.) (తెరపడును)

(ద్వితీయరంగము)

(ద్యుమ్నత్సేనుండు పర్ణశాలయందలి వేదికపైఁ గూర్చుండి,
జపమాలఁ ద్రిప్పుచుండును, తెర యెత్తఁబడును)

ద్యుమ:- (తనలో)

గీ. వేదములు దెచ్చి యెవ్వాఁడు వేధ కిచ్చె
బలిని బంధించి యెవ్వాఁడు వజ్రినేలె
దనుజుల వధించి యెవ్వాఁడు మునులఁ బ్రోచె
నట్టి సద్గుణ బ్రహ్మంబు నాశ్రయింతు.

ఓ జగద్రక్షణ సంధాయకా! రమామనోనాయకా! పుట్టిన
దాది యీ వఱకు సుఖానుభవమే గాని కష్టంబులనెట్టివియో
కలలోనైనఁ దలంచి యెఱుంగ. "పెట్టిన వారికిఁ బుట్టుచే
సాక్షి." యనునట్లు పూర్వజన్మంబునందేమి వ్రతంబు లొనర్చి
జన్మించితినో కాని జరాభారంబునఁ గలదలేక యింట నొక
మూలఁ బడియుండువానికా! భార్యాసుత సమేతంబుగ నీ
ఘోరారణ్యవాసము సంప్రాప్తమగుట! ఓ దేవదేవా! నీ
కైననేల నాయందనుగ్రహము కలుగదయ్యె! నేను నీ యెడ

కేమైన నపరాధం బొనర్చితినా ? లేక, పెద్దలయాన జవదాంటి యుంటినా ? కాక, ఋషీశ్వరుల కేమైన నగ్గొనర్చితినా ? కాదేని, దేవబ్రాహ్మణ మాన్యంబుల కేమైన భంగము గలిగించితినా ? ఇవి యున్నియుఁ గాకున్న వర్ణసంకరమ్మేమైనఁ గావించితినా ? పొరపాటున క్షత్రియ ధర్మంబు లెందేని సరకుఁ గొనక ప్రవర్తించియుంటినా ? లేనిచో, నిష్కారణవైరమూని నన్ను రాజ్యభ్రష్టుని గావించినవానియందుఁ గల కృపారసము నాపై నీకు లేకపోయెనే ! ఒకవేళ మీరు నన్ను మఱచినను, నేను మీ మృదుపద సరసీరుహంబులు మఱవఁగలనా ? మఱచి బ్రతుకఁగలనా? బ్రతికిసుఖింపఁగలనా? అయ్యో! అదేటిమాట?

సీ. చెలఁగియేప్రొద్దు నీ సేవఁ జేయుటె కాని
దబ్బర లేవంకఁ దలఁచి యెఱుఁగఁ
బుడమివేల్పులఁగాంచి పూజసేయుటె కాని
వేహాఱుమదిని గర్వించి యెఱుఁగఁ
దప్పుచేసినవారి దండించుటయె కాని
ధర్మంబులను జవదాఁటి యెఱుఁగఁ
బ్రజల సంరక్షింపఁ బాటుపడుటె కాని
తృణమైన నూరక కడపియెఱుఁగ

గీ॥ నిరపరాధుల శిక్షల నిలిపియెఱుఁగ
శాత్రవులనైనఁ జిక్కినఁ జంపియెఱుఁగ
దోస మెవ్వరికేనియుఁ జేసియెఱుఁగ
నిట్టి నన్నేలమఱచితో యిప్పుడెఱుఁగ.

[ అని మఱల జపమాలఁ ద్రిప్పుచుండును ]

[ అంత అశ్వపతి, మాళవి, సావిత్రి, జయశీలుఁడు కాననము లోనికిఁ బ్రవేశింతురు. ]

అశ్వ:- మంత్రీ! జయశీలా! వనంబెంత రామణీయకమై యున్నదో చూచితివా!

గీ. తోడరి ఝుంకార మొనరించు తుమ్మెదలును
గెరలి భాషించు శారికాకీరములును
గలకలారావములు చేయు క్రౌంచబృంద
ములును జైకొను మయూరములను గంటె ?

మఱియు, నిది తేమొ మహర్షి యాశ్రమ ప్రాంతిమోకాని,

గీ. శరభ హర్యక్ష శార్దూల శల్య ఖడ్గ
గవయ వేదండ భల్ల సృగాల వాహ
శాసర తరక్షు గంధర్వ కపి వరాహ
మృగము లత్యంత మైత్రితో మెలఁగుచుండె.

జయ:- దేవా! మీరాకేశాడు. నాకును నటులనే తోఁచు చున్నయది.

మాళ:- హృదయేశ్వరా ! మనుష్యసంచారంబను మాటయే లేని యీ ఘోరారణ్య మధ్యంబున మన సావిత్రి యెట్లుండఁగలదు?

అశ్వ :-హృదయేశ్వరీ! నీ వా కొంత యొంతమాత్రము మనంబునఁ బెట్టుకొనకుము.

జయ:-అమ్మా ! దైవవిధి యవిలంఘనీయముగదా ?

అశ్వ:-సచివాగ్రేసరా! ఇచటికి కనతి దూరంబునఁ గనుపడునది యేమై యుండనోపు ?

జయ:- దేవా! అదియే ద్యుమత్సేనుని యాశ్రమమై యుండవచ్చును.

అశ్వ:-అటులైన మన మద్దానిని సమీపింతము రండు.

(అందఱు ద్యుమత్సేనుని యాశ్రమమును జేరి)

మునీంద్రా ! వందనములు.

ద్యుమ:-మనోవాంఛాఫలసిద్ధిరస్తు. అయ్యా ! ఇటు దయజేయుఁడు. (అందఱు కూర్చుందురు) మీర లెవ్వరు ?

అశ్వ:-మునిచంద్రా! మద్రదేశాధీశ్వరుండ, అశ్వపతి యను నామంబునఁ బరగువాఁడ. సకుటుంబముగా వచ్చితి.

ద్యుమ:-అశ్వపతీ ! తమ రేకార్యార్థులరై సకుటుంబముగా నిచ్చటికి విచ్చేసితిరి ?

అశ్వ:—పావక వర్షమునకే.

ద్యుమ:—(ఆశ్చర్యమునతో) ఏమీ! నాకొఱకేనా? అట్టులైన నావల్ల మీకుఁ గాఁగల కార్యము లేమున్నవి?

అశ్వ:—కాఁగల కార్యము లుండుటం బట్టియే రాఁగలిగితిమి. ఏమంటి రేని చిరంజీవి మీ కుమారుఁడు సత్యవంతునకు చిరంజీవి సౌభాగ్యవతియగు నా కుమార్తెను సావిత్రి నొసంగి వివాహము చేయఁ దలంచి.

ద్యుమ:—మద్రదేశాధిపతీ! అశ్వపతీ! నేఁజెప్పెడి యంశములు తుద ముట్ట వినుము.

ఉ. కూటికి గుడ్డకుం జెడి మేముఁ గ్రుస్సురుచుంటిమి కాననంబులం
దేటికి నీ కొమారితను నిచ్చి వివాహము సేయఁబూని యి
చ్చోటికి వచ్చితివిపుడు సొంపు చెలారఁగ రాజచంద్ర! య
క్లేటికి వియ్యమందితని యెల్లరు నవ్వరె జగంబులన్.

అశ్వ:—రాజర్షి తిలకా! మీ రిట్లననేల? మన మిరువురము నిష్టపడిన లోకంబుల జనంబులు దూషించిననేమి? భూషించిననేమి?

ద్యుమ:—అశ్వపతీ! ఎట్టి కార్యమైనను సరే ముందు లోకసమ్మతము గావలయును. కావున నీ కొమారిత నింకొక మహారాజు కొమారున కొసంగి వివాహం బొనర్పుము. అప్పుడది జనసమ్మతము గాఁగలదు. అట్లు కాక నీ విప్పుడు మదీయ పుత్త్రుండగు సత్యవంతున కేయొసంగితివేని 'అన్నలమిన్నను, చక్కదనాలకుప్పను, సావిత్రిని విగతరాజ్యుండై ఘోరారణ్యంబుల నివసించు వాని కిచ్చి యశ్వపతి పిల్లకు గొంతుకోసె' నని లోకంబున నిన్నెల్లరు నిందింతురు. కాబట్టి మఱొక రాకుమారుని కొసంగుము. లేదేని నీ మూలమున మే మెల్లపుడుఁ బదువురి నోటఁ బడి నానవలసిన వారమగుదుము.

అశ్వ:—న్యూనత్వేన మహర్షీ ! కలిమిలేములు శాశ్వతములుగావు. మీ తోడ వియ్యమందుటను కౌతూహలంబున మేమిట్లరుదెంచితిమి. మదీయ ప్రార్థనఁ ద్రోసిపుచ్చకుఁడు.

ద్యుమ:—రాజా ! అట్లయిన సంకోచ మనవి.

గీ. సౌధపంక్తుల నివసించు చానయిన్న
కష్టముల కోర్చి యుండుఁ గహనములను
బట్టు చేలంబులను గట్టు బాల నేఁడు
వల్కలాజినములు గట్టు పఱుసయెట్లు.

అశ్వ:— మీ పిల్లయైన వెనుక మీతోఁబాటు కష్టమో సుఖమో యనుభవించునే కాని మా రాడఁగలుగునెట్లు ! స్త్రీల యధికారా నధికారములన్నియుఁ బుట్టినింటకడనే కాని మెట్టినింట కడ సాగఁగలవా ?

ద్యుమ:—(పత్నిశాలకై పునఃపుఁ జరిగి) పఠించిరి. అటులే కానిండు. నాయనా ! సత్యవంతా ! మీ యమ్మ నిటు తోడ్కొనిరమ్ము.

సత్య:—తండ్రీ ! ఇదిగో మా యమ్మ యిచటనేయున్నది.

ద్యుమ:—హృదయేశ్వరీ ! వీరు చెప్పిన దంతయు వినుచుంటివిగదా ! నే నందులకొడంబడితి. నీ యభిప్రాయమేమి ?

భాను:—హృదయేశ్వరా ! మీ కనుకూలంబగుచో నా కనుకూలము గాకుండునా ? పిలిచి పిల్లనిచ్చెదమన్న వద్దననేల ?

ద్యుమ:—అశ్వపతి మహారాజా ! పురోహితుల రావించి సుముహూర్తము నిశ్చయింపుఁడు.

అశ్వ:—లగ్న నిశ్చయమును జేయించుకొనియే వచ్చితిమి.

ద్యుమ:—ఎప్పుడు ?

అశ్వ:—ఈ దినంబుననే కావునఁ బోవుదమురండు.

ద్యుమ:—ఎక్కడికి ?

అశ్వ:—మదీయ పురంబునకు.

ద్యుమ:—రాజా!—మనమిప్పటికి మీ పురంబునకుఁ గొనిపోయెదవు? పదు
గురు మనము నచట నప్పటకాయెను? నే నీ సంగతి మీకు మొద
టనే చెప్పియుంటిని కదా?

అశ్వ:—మీ రిప్పు డేమనియెదరు?

ద్యుమ:—మీ రిచటికి సకుటుంబముగా వచ్చియుంటిమని కదా!
నాతోఁ జెప్పియుంటిరి. కాఁబట్టి వివాహ మిచటనే చేయుఁడు.

అశ్వ:—అటులే యొనర్చెదము. తగు ప్రయత్నములో నుందము లెండు.

(అందఱు నిష్క్రమింతురు) (తెరపడును)

[వివాహానంతరమున మధుపర్కములతో సావిత్రీ సత్యవంతులును,
నూతనాంబరములు ధరించి భానుమతీద్యుమత్సేనులును,
మాళవీ యశ్వపతులును ప్రవేశింతురు]

అశ్వ:—బావా! ద్యుమత్సేన మహర్షీ!

ఉ. బిడ్డలు లేక లేక దుర పిల్లఁగఁ బిమ్మటఁ గొన్నినాళ్ళ కీ
బిడ్డయె కల్గ నీమెనతి ప్రేమను బెంచుచునున్న వాఁడ మా
రొడ్డదిఁ కెవ్వ రేనుసుచు నుండినగానియు మీఁదె భార మీ
బిడ్డను మీదుబిడ్డవలెఁ బెంచుఁడు కోపముఁ బూనకెంచుఁడీ.

ద్యుమ:—బావా! అశ్వపతీ! ఈ విషయము మీరింతగాఁ జెప్పవల
యునా? నే నంతమాత్రమెఱుంగని వాఁడనా?

అశ్వ:—మీ రెఱుంగరని కాదు. నా పుత్త్రికయందుఁగల ప్రేమచే
నిట్లనుచుంటిని.

మాళ:—అమ్మా! సావిత్రీ! (అని సావిత్రి మీఁదఁ జెయివైచి)

క. పనిలేకయె పొరుగిండ్లకుఁ
జన కెప్పుడు మగనికేది సమ్మతియో యటే
పనిఁ జేయుచ త్త మామల
కనుకూలముగా మెలంగు మమ్మాయెపుడున్.

(భానుమతి వైపునకుఁ దిరిగి) వదినె గారూ! మా పిల్లను మీ పిల్లవలెఁ జూడ గోరెదను.)

అశ్వ:—జామాతా ! సత్యవంతా !

గీ. పుట్టినప్పటినుండి యీ పొలతిమిన్న
చేసి యెఱుఁగదు పనులేమి చేఁతగావు
కని యెఱుంగ దొక్కింతయుఁ గష్టచయము
నంతియేకాని నేఁజెప్పునదియు లేదు.

(సావిత్రి చెయి పట్టుకొని) పుత్త్రీ ! సావిత్రీ !

గీ. మంచి చెడ్డ లటంచు రిమ్ముహిని రెండు
వానిలో మొదటి దసాధ్యమౌను బుట్టె
నింటికి మఱియు మెట్టిన యింటికీవు
పేరుఁదేవమ్మ! వెనుకటివారి నెంచి.

మీ అమ్మయు నేనును నప్పుడప్పుడు వచ్చిపోవుచుందుము. నీ చెలికత్తియలు గూడ వచ్చి పోవుచునే యుందురు. నీ మనంబున వేఱుగాఁ దలంపకుము.

గీ. అరసికొనుచుందు నమ్మనే నప్పుడపుడు
నీదు వృత్తాంత మంతయు నిక్కువముగ
నత్తమామలఁ గాంచుమత్యంత భక్తిఁ
గంట తడిబెట్టఁబోకు నన్నన్న తల్లి.

మే మికఁ బోయి వచ్చెదము. (ద్యుమత్సేనుని వంకజూచి) బావగారూ ! సెలవు.

ద్యుమ:—మంచిది. అటులేపోయి రండు.

[ అందఱు నిష్క్రమింతురు ]

( తె ర ప డు ను )

తృతీయాంకము సంపూర్ణము.

శ్రీ ర స్తు

# సావిత్రీ సత్యవంతీయము

## చతుర్థాంకము

(పర్ణశాలయం దొకవైపున సావిత్రీ దేవీ పూజామంటపము)
(వల్కలాజిన ధారిణియై సావిత్రి ప్రవేశించి పూజామంటపమున కెదు
రుగాఁ గూరుచుండి పూజా ద్రవ్యములు సవరించుచుండును)

(తెరయెత్తఁబడును)

సావి:—(లేచి తనలో) నా జీవితేశ్వరుని యాయుఃప్రమాణమునుగూర్చి నారద మహర్షి నాఁడు నాకెఱింగించిన గడువుదినమింక నేఁటికి నాలుగు దినములు మాత్రమే యున్నది. నే ననవరతము నమ్మి సేవించు జగన్మాతయగు సావిత్రీ దేవిని గుఱించి త్రిరాత్రోపవాస వ్రతంబు గావించు వారలకు సకలశుభంబు లొనఁగూడునని పెద్దలు చెప్పఁగా వినియుంటిని. కావున నే నీ దినంబున త్రిరాత్రోపవాస వ్రతంబును ప్రారంభించి నాఁటికి ముగించుకొనియెదను.

(అంత ద్యుమత్సేన నిర్వికారులు ప్రవేశింతురు)

సావి:—మామగారూ! నమస్కారములు.

ద్యుమ:—సత్సంతాన ఫలావాప్తిరస్తు.

సావి:—ఋషిచంద్రమా! అభివందనములు.

నిర్వి:—మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

ద్యుమ:—తల్లీ! ఇట్టి కఠిన వ్రతంబేల పూనితివి?

సావి:—నే ననేక కల్యాణంబులఁ గోరి యీ వ్రతంబును బూనితిని. మీరు మదీయ వ్రతంబునుగూర్చి విచారింపవలదు. మీకన్ని విషయములు సవిస్తరముగా నిఁక ముందు తెలియఁగలవు.

ద్యుమ:-మంచిది. అటులే కానిమ్ము. (నిర్వికారుఁడితో నిష్క్రమించును)
(తిరిగి సావిత్రి పూజామంటపమున కెదురుగాఁ గూరుచుండి,
పుష్పాక్షతలచేఁ గొంత తడవు పూజించి, లేచినిలుచుండి

(ప్రాంజలియై)

ఓ జగజ్జననీ! సావిత్రీ!

గీ. సకలలోకములు సృజించు స్రష్ట, మనుచు
హరి, లయంబొనర్చు శివుఁడు, సురలు, మునులు
ప్రస్తుతించెడు నీ పాద పద్మములకుఁ
బ్రణుతులిడుచుంటిఁ గొనుము భవాని! తల్లి!!

మఱియు,

సీ. నీ యాజ్ఞచేఁ గదా! నిఖిల లోకంబులు
బ్రహ్మ సృజించుటో పద్మనయన
నీ యాజ్ఞచేఁ గదా! నిఖిల జీవాళిని
విష్ణు పోషించుటో విశ్వ జనని
నీ యాజ్ఞచేఁ గదా! నిఖిల భూతంబుల
స్థాణుండు చంపుటో చంద్రవదన
నీ యాజ్ఞచేఁగదా! నిఖిలస్థలులఁ బుష్ప
వంతులు మెలఁగుటో భవ్యచరిత

గీ. మఱియు నీ యాజ్ఞచేఁ గదా! మహిని, వహ్ని
వెలుఁగుటయు, జగత్ప్రాణుండు వీచుటయును,
బరగ పర్జన్య దేవుండు వానకురియు
ట, యముఁ డాత్మల శిక్షించుటయును, దల్లి.

గీ. దండగీఁడులు లోక విద్రోహులైన
చండముండులు, ధూమ్రలోచన, నిశుంభ
శుంభ, మహిష ప్రభృతి రాక్షసుల వధించి
జగములకు మేలు గూర్చితో జనని నీవు?

ఇట్టి నీకు నన్నుఁ గాపాడుట యొక లెక్కలోనిది గాదు.

గీ. అన్నిఁటికి మూలకారణమైన నిన్నుఁ
దెలిసికొనలేకపోయిరి దేవమునియు,
హరిహర బ్రహ్మ లింద్రాదు లంతవారు
మానవాంగన నే నెంతదానఁ జెపుమ.

ఏది ఎట్లున్నను,

క. నీ పద రాజీవంబులె
ప్రాపని ధ్యానించు భక్తురాలను నన్ను
న్గాపాడు భారమంతయు
నీ పైనిడి యున్నదాన నిజము భవానీ!

(అని కర్పూర హారతి వెలిఁగించి)

క. కొనుమిదె కర్పూరపు టారతి
జననీ! సావిత్రి దేవి! సమ్మోదమార
న్నను నానాథుని నెప్పుడు
కను తెప్ప విధానఁ గావఁగావలెనమ్మా!

(తిరిగి ద్యుమత్సేనుఁడు ప్రవేశించును)

ద్యుమ:— అమ్మా! సావిత్రీ! నేఁటితో వ్రతంబు పూర్తియైనది కదా! ఇంకను ఆలస్యమేటికి! చూడు మప్పుడే జాము ప్రొద్దెక్కినది. లేచి పారణ నేయుము.

సావి:—ఆర్యా! నే నీ దినంబునఁ బ్రొద్దు గ్రుంకినంగాని భుజింపఁదగదు. ఇది నేను ప్రారంభమున నియమించుకొనిన నియమము.

ద్యుమ:—సరియే! మంచిది.

సావి:—మామగారూ! (అని పాదములు పట్టుకొని) మీ తనయుండు సమిత్కుశ ఫలాదులు తెచ్చుటకు వనంబునకుఁ బోవునప్పుడు నాకును నతనివెంటఁ జని కాననంబును జూడవలయునని కోరిక జనించినది. కావున మీరు నా కీవరంబు దయసేయుఁడు.

ద్యుమ:—మంచిది. (అందఱు నిష్క్రమింతురు) తెరపడును

ద్వితీయ రంగము,

(వల్కలాజిన ధారియై సత్యవంతుఁడు ప్రవేశించును)

సత్య:—(తనలో)

గీ. వంగడము వృద్ధిఁ జేసెడు వరసుతుండు
లేమి దైవతములఁగూర్చి లెక్కలేని
వ్రతములను సల్పి పుత్త్రిలఁ బడయునట్టి
తల్లి దండ్రులఁ బోషింపఁ దలఁప వలదె ?

నా పనిని నేను నెఱవేర్చుకొన వలయునుగదా! నా తలిదండ్రు లనుదినము సమిత్కుశ ఫలంబులఁ దెచ్చునట్లు నా కాజ్ఞాపించిరి. అదిగో!

సీ. గీర్వాణరాజన్య కేళికాగృహమందు
దీపించు రతనంపు దివ్వెయనఁగ
వనమాలిదైత్యులఁ బరిమార్చు తఱిని హ
స్తమున దాల్చెడు సుదర్శన మనంగ
నిర్జరావళి నెమ్మి నిరతంబు భుజియింపఁ
గానొప్పు బంగారు కంచమనఁగ
ప్రాక్సతి నాసికాగ్రంబున రవలచే
లలితమై మెఱయు బులాకి యనఁగ

గీ. గగన భారతి ముంజేతి కడియమనఁగ
భవుఁడు సంధ్యవార్చెడు హరి వాణమనఁగ

ప్రస్ఫుట ప్రభాస్తోమములు సేయు సారె యనఁగ
భానుఁ డుదయించె నుదయాద్రిపైని నిపుడె.

నేఁడేమి కతంబుననో కాని ప్రొద్దు వొడమున దనుక నిదుర మేలొ్కానకయుంటిని. ఏమి ముప్పు వాటిల్లనున్నదో కదా! సంధ్యా వందనాది క్రియల నెఱవేర్చుకొనిన పిమ్మట సమిత్కుశ ఫలా దుల కొఱకేఁగి వచ్చెద. నే నిప్పుడు ననలితినేని తల్లి దండ్రుల యనుజ్ఞ నుల్లంఘించిన వాఁడనై యధోగతుల పాలు గావలసి వచ్చును. (అని నిష్క్రమించి తిరిగి గొడ్డలిని భుజముపై నిడు కొని ప్రవేశించును)

(అంత వల్కలాజిన ధారిణియై సావిత్రి ప్రవేశించును)

సావి:—(తనలో) అన్నపానీయములు మాని యత్యంత శ్రద్ధాభక్తుల సావిత్రీదేవి నుద్దేశించి కావించిన త్రిరాత్రోపవాస వ్రతంబును బరిసమాప్తి నొందించితిని; కాని నే నీ దినంబున హృదయేశ్వ రుని నొక్క నిముసకాలమైనను విడచియుండరాదు. ఏలయన మదీయ ప్రాణవిభుఁ గూర్చి నారద మహర్షి నాఁడు నాకెఱిం గించిన గడువు దినము నేఁడేకదా! కెండియు నీతఁడు తదను కూలంబుగ నేఁడేటికో కుఠారమొందుఁగొని యెచ్చటికో పో యత్నించుచుండెను. నేనును వెనువెంట నేచని మీఁద జరుగఁ గల వృత్తాంతమును దెలిసికొనియెద. (అని ప్రకాశముగా) హృదయేశ్వరా! నమస్కృతులు. మీరిప్పు డెచ్చటికేఁబోవ నుద్యమించుచుంటిరి?

సత్య:—సఖీ! ఈ సమీపారణ్యమునకు.

సావి:—నాథా! ఏమిటికి!

సత్య:—కల్యాణీ! చెప్పెదను వినుము.

క. జననీ జనకులు వృద్ధులు
　సనతే రెచ్చోటి కబల! సమిధలకై నేఁ

జటివత్తు సత్రమాల
మనసులు గని పెట్టి మెలఁగు మంచిగ నిచటన్.

సావి:—హృదయేశ్వరా! నేనును మీ వెంట వనంబుఁ జొరవచ్చెద.

సత్య:—దేవీ!

గీ. సల్పితివి త్రిరాత్రోపవాసవ్రతంబు
దేవి సావిత్రినిం గూర్చి తెలుపవలెనె
దానఁ గడుడస్సియుంటివి గాన నేఁడు
పారణము సేయకీవెట్లు వచ్చెదిపుడు?

సావి:—హృదయేశ్వరా! ఉపవాసంబువలన నాకేమియు శ్రమ కలుగదు. అయినను ఈ దినంబునఁ బ్రొద్దు గ్రుంకినంగాని భుజింపనను నియమము కలదు. లేనిచో, వ్రతంబు చెల్లనేరదు. కావున నే నిచ్చటఁ జేయునదేమున్నది? నన్ను మీ వెంటఁ గొనిపొండు. మామగారి యనుజ్ఞను బొందియే మిమ్ముఁ గలిసికొంటి.

సత్య:—పురంధ్రీమణీ! ఇదియేటియాప్సితము?

మ. వడుగా? పెండిలియా? రమారమణుసేవా? మేలిపేరంటమా?
జడదార్లొప్పగఁ జేయు సత్స్వవనమా? సౌభాగ్యనిక్షేపమా?
పడతుల్ వ్రోదగు తావెఱుంకగ సతీ! ప్రార్థించు నీ విట్లు న
న్నడుగంగాఁ దగునే భయం పడరెయాహా స్త్రీలు ఘోరాటవిన్.

సావి:—జీవితేశ్వరా!

మ. వడుగున్, బెండిలియున్, రమారమణుసేవల్, మేలి పేరంటమున్
జడదార్లొప్పగఁ జేయు సత్స్వవనమున్ సౌభాగ్య నిక్షేపమున్
దడఁబాటొందక కంటి మజ్జనకు సద్మంబందు మీ వెంట నీ
యెడ రానిచ్చుటె నన్ని చేకుటినవా నీ కోర్కె సెల్లింపరే!

సత్య:—దేవీ! గాఢారణ్యంబన నేమియో తెలియక కిటు లనుచుంటివి. కావున నెక్కమాఱు నీకా కాననంబునుగూర్చి చెప్పెద నాకర్ణింపుము.

సీ. పరమ మునీంద్రుల పర్ణశాలలె కాని
నిలయంబు లెందు గాన్పింపవచట
నతిభయంకరమైన యా రావములె కాని
వినఁబడ వెందు సుస్వనములచటఁ
గ్రూర మృగానేక కులసంతతులె కాని
కనఁబడ రెందుసూ మనుజులచట
సరసగంభీర శిఖర బృందములె కాని
నగరంబులెందుఁ గన్పట్టవచట

గీ. సల్లిబిల్లిగ నల్లుకొన్నట్టి పొదలె
కాని చూపట్ట వెందు మార్గంబు లచటఁ
గాఱు చీకట్లె నెప్పుడుఁ గ్రాలుఁగాని
వెలుతురనుమాట లేదెందు వెలఁది యచట.

సావి:—జీవితేశ్వరా! కాంతారమట్లుండునని నే నెఱుంగక పోలేదు.

సత్య:—దేవీ! నీ వెన్నఁడును వీక్షింపకయే యెట్లు తెలిసికొనఁగలిగితివి?

సావి:—మనోనాథా!

గీ. కనుల రెండింట నెప్పుడుఁ గాంచకున్న
బాల్యమున గురువులపొంతఁ బరమభక్తిఁ
జదువుకటి కావ్యములయందుఁ జదివితి, వన
వర్ణనలు పెక్కులనయంబుఁ బట్టుదలను.

సత్య:—దేవీ! కాంతారమట్లుండునని నీ వొకవేళఁ గావ్యములయందుఁ జదివి యుండినను, అబల వగుటచే భీకరమృగంబులఁ గాంచి నంతయు సంతసింపనేరవు.

సావి:—ప్రాణేశ్వరా! మీరు వెనువెంట నుండునప్పుడు క్రూరమృగాదులఁ గాంచి భయపడు టెట్లు?

సత్య:—అకటా! సుందరీ! నే నెంత చెప్పినను వినవైతివే!

సావి:—ఆఁడువారల కించుక చనవు చెల్లనిల్లదు కాఁబోలు

సత్యః-సఖీ! నే నేల రావద్దంటినో యించుకయైనను గ్రహించలేక పోయితివి. 'దిగినఁగాని లోఁతు తెలియ' దన్నట్లు ముందు ముందా దుర్గమంబుల దాఁటునప్పుడు కాని నీకు స్పష్టము కానేరదు. సరే! పోవుదము రమ్ము.

సావిః-(తనలో) ఆహా! ఇప్పుడు కదా నేను ధన్యురాలనైతిని.

సత్యః-దేవీ! పోవుదము రమ్ము. (ఇరువురును చేతులు పట్టుకొని నిష్క్రమింతురు)

సావిః-మనోనాథా! ఎక్కడి దా కోలాహలము!

సత్యః-కల్యాణీ!

గీ. సింహశార్దూల మత్తేభ శివ వరాహ
శరభ భల్లూక కీశ కాసర మృగంబు
లల్ల దేచూడు! వనమునం దెల్ల రొదలు
సల్పుచున్నవి జడియకు చంచలాక్షి.

(అని భుజముపైఁ దట్టును)

సావిః-మీ రిందుండ నా కేమి భయము.

సత్యః-రామామణీ!

గీ. కాననంబెల్లఁ గ్రుమ్మఱి కడుబడస్సి
స్వాంతములురోయ సింగముల్ శ్రమమువాయ
విటపములనీడ నొక్కింత విశ్రమించి
పోవుచున్నవి చూచితే పొలములకును.

మఱియు నిదే నా ప్రేలివంకఁ జూడుము.

మ. అదియే బెబ్బులి డాని వెన్కఁ గలదే హర్యక్షు మారెంటినిం
గదియన్వచ్చునదే వరాహ మివియే గంధర్వపోతంబు, ల
ల్లదె గోమాయువు క్రేళ్ళు దాఁటునవె సారంగార్భకంబుల్ బళీ
మదిరంజిల్లఁగఁగాంచియుంటివఁటె కొమ్మా! యిట్టిమొత్తంబులున్

సావి:—మనోనాథా! ఈ తపోవనంబుల నత్యంతమనోహరమై కన్పట్టున
వేమి ?

సత్య:—ప్రేయసీ!

గీ. ధనకనకవస్తువాహన ధాన్యవితతి
పైని, దారాసుతాదుల పైని, నెట్టి
కోరికలులేక పరమేశుఁ గూర్చితపము
సలుపు తాపసేంద్రుల పర్ణశాలలబల.

సావి:—ఈవన శృంగారం బెంతయును గొనియాడఁ దగియున్నది.

సత్య:— దేవీ! అటు చూడుము.

గీ. పారిజాతంబు లటుచూడు పల్లవోష్ఠి
మల్లెసంపెంగ లిటుచూడు మందగమన
జాజి విరజాజు లవె చూడు చంద్రవదన
మొల్ల చేమంతులివె చూడు ముద్దుగుమ్మ.

సావి:—కమ్మని వాసనల వెదచల్లు నీ పుష్పరాజంబు లెంతయు స్తుత్యర్హములు.

సత్య:—కల్యాణీ! (అని రెండడుగులు ముందునకు వైచి)

క. ఇదె సంతాన మహీరుహ
మిదియే సహకారశాఖ యిదె వటవృక్షం
బిదియే బిల్వ మహీరుహ
మిదియే సురపొన్నసాల మిందునిభాస్యా !

సావి:—సూర్యకాంతులనేనిఁ బ్రసరింపనీక చల్లని నీడలనిచ్చుచుఁ బాంథుల మార్గాయాసంబులఁదీర్చు నీ వృక్షంబు లెంతయుశ్లాఘా పాత్రములు.

సత్య:—ప్రేయసీ! [అని ఒక్కొక్క దానిని జూపును]

సీ. రమణీయ సరసీతరంగావళుల నూఁగు
చానంద మొందు రాయంచలవియె

బాగుగాఁ బండిన ఫలరసంబుల నాని
వల్కులాడెడు రామ చిల్కలివియె
నళినీ మరంద పానంబునం దేలి ఝం
కారమొనర్చెడు భృంగంబు లవియె
పింఛంబులను విప్పి వెలయు నెత్తమ్ముల
నృత్యంబు సల్పెడు నెమళు లివియె

గీ. ప్రథిత మాకంద తరుపల్లవముల మెసవు
చింపుగాఁబాడు గండుకోయిలలు నవియె
సకల ఋతువులయందు నేశ్రమము లేక
పురుగులను నేటికొని తిను పులుగు లివియె.

సావి:—ఈ విహంగంబు లొండొరులతో ముచ్చటించుకొనుచున్నవా
యనునట్లు మోముమోమునం జేర్చి చేయు కిలకిలారావంబు
లెంతయుఁ గొనియాడఁ దగియున్నవి.

సత్య:—దేవీ! ఇదిగో! ఇటు పోవుదముర మ్ము. (అని ముందునకునడచుచు)

సీ. ఇరుఁగెలంకుల నున్న యీ కంటకంబులఁ
బరికించి కాల్వెట్ట వలయు నిచట
నిరుచక్కియల నున్న యీ మేటిలోయలఁ
బరికించి నడువఁగా వలయునిచట
నిరుప్రక్కలందున్న యీ పాముపుట్టలఁ
బరికించి పోవఁగా వలయునిచట
నిరుప్రక్కలందున్న యీ మిట్టపల్లముల్
పరికించి కాలూన వలయునిచట

గీ. రెండువైపులనున్న యీ గండుచీమ
వరుసఁ బరికించి దాఁటిపోవలయు నిచట
నుఱియు నిరుప్రక్కలందున్న కఱకుఱాల
పంక్తిఁ బరికించియేఁగఁగా వలయునిచట.

(ఇరువురు నిష్క్రమించి, తిరిగి ప్రవేశింతురు)

సత్య:—కాంతామణీ! ఇటు చూడుము.

క. ఇదియొక తామర కొలనో
ముదితా! వీక్షించినావె?......

సావి:—......పూవు లవెంతో
ముదముం గూర్చుచు నున్నవి.

సత్య:— ఇదిగో! తలదాల్చు దీని నిందునిభాస్యా!
(ఒక పువ్వును గోసియిచ్చును)

సావి:—(తలలో ధరించును)

సత్య:—హృదయేశ్వరీ! మన మీ వినోదంబులం జూచుచు జాగుసేయ
జనదు. అదిగో! అప్పుడే ప్రొద్దు గ్రుంకవచ్చినది. నీ వీ పుష్పం
బులఁ గోయుము, నే నిదె యా కింశుక తరువుసంగల సమిధల
ఛేదించుకొని వచ్చెద.

సావి:—అటులే చేసెదను. ( అని పుష్పంబులఁ గోయుచుండును)

సత్య:—(చెట్టు దగ్గఱకుఁ బోయి గొడ్డలితోఁ గొమ్మ నఱకుచుండును.)
ఆహా! ఏమి! ఈ శిరోవేదన మెంత మిక్కుటముగా నున్నది.
(అని గొడ్డలిని బుడమిపైవైచి రెండుకణతలు గట్టిగాఁ బట్టు
కొని నేలఁ గూర్చుండును.)

సావి:—(తనలో) నాథుఁడేటికో కొమ్మ కొట్టుట మాని శిరంబును గరం
బులఁ బట్టుకొని కూర్చుండియున్నవాఁడు. (సమీపించి) ప్రాణే
శ్వరా! ప్రాణేశ్వరా!! ఏ మిట్లు తల పట్టుకొని యుంటిరి?

సత్య:—కాంతామణీ! నేఁ డేమి కతంబుననో నాకు శిరోవేదన యపరి
మితముగఁ బుట్టు చున్నది. నీ యంకతలం బుపధానముగఁ
జేయుము. పరుండెదను.

సావి:— అటులనే యొనర్చెదను. (కూర్చుండును)

సత్య:—[సావిత్రి తొడపైఁ దన శిరముఁ జేర్చి పరుండును.]
ప్రేయసీ!

ఉ. ఎన్నఁడుఁ జైత్యమా యెఱుఁగ నించుకయేని నిజేశుచిత్రమా
యన్నుల మిన్న! నేఁడు జగమంతయు మాసిన భంగిఁ దోఁచి నా
కన్నుల కెల్లవస్తువులు గన్పడుచున్నవి పచ్చనై నశుక్ల
గ్రన్నన జేర్పఁ గావలయుఁ బ్రాణసఖీ! మన పర్ణశాలకున్.

అక్కటా! నీవు నన్నుఁ దీసికొనిపోవు టెట్లు? నేను రాఁగలుగు టెట్లు?

మ. ఒడలా కంపమునొందసాగె జ్వరమా యొక్కింత గన్పట్టెడిన్
దడఁబాటయ్యెను నాల్కపైని దడి సాంతంబార దిక్కిది యి
క్కడ లేరెవ్వరు వైద్యులొక్క రయినం గష్టంబు జీవించుటో
పడఁతీ! శీతల మేర్పడం దొడఁగె నీ భాగ్యం బదెట్లున్నదో?

సావి:—జీవితేశ్వరా! జ్వరము వచ్చినంత మాత్రముననే ఇట్లధైర్య పడెదరేల? మానవ శరీరంబు కాదా?

సత్య:—ఓ తన్వీ!

గీ. సఖియరో! అకాల మృత్యు వాసన్నమైన
ధైర్య మూనుట యెట్టులధైర్యపడక
దీర్ఘరోగమె యొకవేళఁ దిరుగునంచు
సంతసింపను మదిలోన వంతదక్కి.

సావి:— నాథా! ఏమిట్లనుచుంటిరి? ఇంకెవ్వరుదిక్కు? (దుఃఖించును)

సత్య:—ప్రాణేశ్వరీ! ఏల యిట్లేడ్చెదవు?

క. తక్కువ నోములు నోచియు
నెక్కువ ఫలములను గోర నెటువచ్చు సఖీ
జక్కవలు గూయఁ జాలునె
జక్కఁగఁ గోయిలలుగూయు చందంబెసఁగన్.

మఱియు,

ఉ. పుట్టిననాటనుండియును భూరిసుఖాను భవంబుతోడ మే
ల్పట్టెని నిన్నుఁబెంచి వనవాస మొనర్చుచు నుండువానికే

గొట్టుల నిత్తునంచు మది నెంచక నీ జనకుండు నాకు ని
న్నిట్టనఁ బెండ్లి సేయుటది నేఁడు విషంబయి పోయె నక్కటా!
ఇదియునుం గాక,

సీ. సౌధ పంక్తులయందు సంచరించుటఁ బాసి
వనవాసు లిండ్ల యే పడఁతి మెలఁగె
కాంచనాంబరములు గట్టుసౌఖ్యముఁ బాసి
వల్కలాజినములే వనితగట్టెఁ.
చెలికత్తియలఁ గూడి మెలఁగు సంపదఁ బాసి
మునిపత్నులందు నే ముదితయుండె
సాటివారల బంధు సంఘాతములఁ బాసి
ఘోరాటవులను నే కొమ్మమెలఁగె
గీ. నట్టిగుణవతి యబల వర్ధాంగి విపుడు
దట్టమగు కాననంబెట్లు దాఁటఁగలవు
తెలియఁబడదయ్యె నేడ్వాసు తీఱెఋణము
నీకు నాకును నేఁటితో నెలతమిన్న!

కాంతామణీ! ఇంకేటియాశ!

గీ. తల్లి దండ్రులు వృద్ధులై దైవములని
నమ్మియున్నార లైననూ కొమ్మనీవు
భక్తియుక్తిని బూజించు వారినెప్పు
డల్లదే యమధర్మరాజరుగుదెంచె.

ప్రాణేశ్వరీ! నీ యత్తమామల కడకు నీ వేఁగినప్పుడు వారు నన్నుఁ గూర్చి నిన్నేమైనఁ బ్రశ్నింపక మానరు. ప్రశ్నించి నప్పుడు వారికి నా మాటలుగా నిట్లనుము.

తల్లి దండ్రులనింక దయఁజూతు రెవరంచుఁ
బలుమాఱు మిమ్ములఁ దలఁచెననుము
ఇంధనాదులుదెచ్చి యిచ్చువా రెవరంచుఁ
బలుమాఱు మిమ్ములఁ దలఁచెననుము

వేదశాస్త్రంబులు వినుపింతు రెవరంచుఁ
బలుమాఱు మిముఁ దలఁచెదను
ద్వీప సింహముల బాధఁ దీర్చువా రెవరంచుఁ
బలుమాఱు మిమ్ముల దలఁచెదను

గీ. ఎవరు ఫలముల నందింతు రెపుడనంచు
దయను బలుమారు మిమ్ముల దలఁచెదను
కడకు మిమ్ముల నొకసారి కాంచకుండ
నెంతో దురపిల్లి తా దివి కేఁగె ననుచు.

(అని కన్నులు మూసికొనును)

సావి:- (సత్యవంతునిపైఁ బడి) హా! జీవితేశా! భువనైకప్రకాశా! ఈ గాఢారణ్యమధ్యంబున నన్నొంటిగ డించి నీ వొక్కఁడవే పరలోకగతుఁడవైతివే! హా! నాథా! నీ యర్ధాంగినగు నన్ను నీ వెంట నేలకొనిపోవైతివి? హా! హృదయేశ్వరా! (మూర్ఛిల్లి మరల స్పృహఁదెచ్చుకొని)

శా. కోపంబొంది యెఱుంగ వెన్నఁడును నయ్యో కూర్చున్న బాల్యాలి యిం
కే పాపం బొడిగట్టలేదు మఱి నీ వెవ్వారి దూషింపలే
దే పాపాత్ముల మోముగాంచితి మొ యిట్టీచావు నేఁడిప్పుడే
ప్రాపై వచ్చునటంచు నెంచవు గదా ప్రాణేశ్వరా! యెన్నఁడున్.

మ. అకటా! యెవ్వరి వేఁడుదాన ధరపై నన్యాయమే పాపమే
ప్రకటంబయ్యె నటంచుఁ జెప్పఁగల ధీరస్వాంతు లెవ్వారు తే
రిఁక నెందేఁగెదుదానఁ గాలగతి యిట్టీరీతిగా మాఱు నం
చొకనాఁడైన దలంపరాద్యులు నిజంబో వల్లభా! యుద్ధతిన్.

గీ. శ్రీహరీ! యెట్టిపాపంబు చేసినాను
పూర్వజన్మంబునందు నీ పుణ్యరాశి
నిపుడు గోల్పోతి నింక దిక్కెవరునాకు
అకట! వైధవ్యమెబ్భంగి ననుభవింతు?

అకటకటా ! దిక్కెవ్వరు ? నే నెవ్వరి వేఁడుదాన ? పావం
బను వారలెక్కడనైన నీ జగంబున లేరే ! ఉండినను, నన్నుస
ర్థులుగాని సమర్థులుగారే ? అయ్యో ! నన్నెవ్వారు బ్రోచువా రెవరు?
ఓ చంద్రమతీ ! దమయంతీ ! మహాపతివ్రతామతల్లులారా !
మీరైన నేల సత్యవంతుని చిరాయురుపేతుఁ డగునట్లు దీవింప
రైరి ? ఓ జగజ్జననీ ! కాత్యాయనీ ! నిన్ననవరతము నమ్మి
సేవించు నాయెడ నీకైన నేల కరుణ పుట్టదయ్యె.
ఓ సంపదలవల్లీ ! తల్లితల్లీ ! నీవైన నేలమదీయ ప్రాణవిభుని
రక్షింపఁ జాలవైతివి ? ఓ వాణీ ! వినుత గీర్వాణీ ! నీవైననేల
నీ మగనితో సత్యవంతునకు దీర్ఘాయువొసంగుమని చెప్పవైతివి?
అయ్యో ! భూత భవిష్యద్వర్తమానంబులు దెలిసికొనఁజాలిన
మీరలే యిట్లుపేక్షించి చూచుచుండ నొకమాత్రపు వారలు
నన్ని విపత్సాగరమునుండి దరిఁజేర్పఁగలరా ? అయ్యో !
అదేటి మాట ! అంతమాత్రపు సహాయమే నాకు లభింపనున్న
యీ పతి వియోగము సంభవింపకయే యుండునుగదా ! అక
టకటా ! మద్ర దేశాధీశ్వరుని కొమారితనై సార్వభౌమ
పదంబనుభవించిన ద్యుమత్సేన రాజర్షి కోడలినై నిత్యసత్య
వ్రతుండైన సత్యవంతుని కిల్లాలినై యీ కీకారణ్య మధ్యంబున
'నా' యనుతోడు లేక యేకాకినై దిక్కుమాలి యల్లాడవలసి
వచ్చెనే ! హా ! హృదయేశ్వరా ! నిన్నుఁబాసి నే నెందులఁ
బోవఁగలను ? అకటా ! దిక్కెవ్వరు ? హృదయమా ! నీ
వెందులవసించెదవు ? వలపా ! నీవెందు డాగెదవు ? పంచప్రాణ
ములారా ! మీ రెందుండెదరు ? ఏమీ ! మీరందరు సత్య
వంతుని సన్నిధినే నివసించెదమనియా చెప్పుచుంటిరి. హా !
ప్రాణేశ్వరా ! ప్రాణేశ్వరా ! ! (అని మూర్ఛిల్లి మఱల లేచి)

పూర్ణ చంద్రునిడాలుఁ బురడించు నెమ్మోముఁ
గాంచు భాగ్యంబింకఁ గలుగు టెట్లు ?

పంకేరుహాక్ష! మీ పాదంబుల కెఱఁగి
 సేవించు భాగ్యంబు చెందు టెట్లు?
భవ్యాత్మ! నీ దివ్య వాక్యామృతంబాను
 భాగ్యంబపుడిక మీఁదఁ బడయు టెట్లు?
ప్రవిమలాకార! నిన్బరిరంభణము సేయు
 భాగ్యంబు నాకింక వఱలు టెట్లు?
గీ. పూని పుట్టింటి కింకనేఁ బోవు టెట్లు!
 తెలసి పరివారిలో నింక మెలఁగు టెట్టు?
 ఉత్తమామల కడకునే నరుగు టెట్లు?
 ప్రాణవల్లభ! నినుఁబాసి బ్రతుకు టెట్లు?

సీ. పదఁతీలలామ! నీ పాదంబు లవియెంత
 కందెనో గద కంట కములకతనఁ
దలిరుఁబోఁడిరో! నీదు తనువెంత డస్సెనో
 మిట్ట పల్లంబుల మెలఁగు కతన
నిందీవరాక్షి! నీ వెంత భీతిల్లితో
 క్రూరమృగాదులు కూయుకతన
నిభయాన! నీవెట్టి యిక్కట్లపాలైతో
 ఘోరాటవులనన్నుఁ గూడుకతన
గీ. నంచుఁ బలుమాఱునన్ను నీ వాదరమునఁ
 బలుకరించెద వెవరింకఁ బలుకరించు
 వారు క్షేమమరయువారు లేరె దివికి
 జీవితేశ్వర! నీవెట్లు చేరి తకట!

సీ. ధర్మంబులను జవ దాఁట నొల్లని ధర్మ
 రాజసముండు నా ప్రాణవిభుఁడు
సత్యంబు దప్పని సత్య హరిశ్చంద్ర
 కల్పుఁడు నా మనో కాంతుఁడిలను

గురునాజ్ఞ మీఱని పరశురామోపమా
    నుఁడు నా మనోవల్లభుఁడు నిజంబు
పద్మాక్షు మఱవని ప్రహ్లాద తుల్యుండు
    పరికింప నా మనోహరుఁడు సుమ్ము

గీ. అకట! యిదియేటి యన్యాయ మయ్య! ప్రోవ
రయ్య! రారయ్య! మొఱ వినరయ్య! కాంచ
రయ్య! నానాథుఁ బ్రతికింప రయ్య! యక్ష
గరుడ గంధర్వ కిన్నర గణములార!

గీ. పుట్టి నట్టిటఁబడి మున్గి పోయెనింకఁ
జేర రారేమి; దరికి నఁ జేర్చరేమి;
అష్టదిక్పాల వరులార! యమరులార!
పరమ మునులార హరిహర బ్రహ్మలార!

హా! హృదయేశ్వరా! నీ పాదాంభోరుహంబు లశ్రాంతము నెమ్మదిందలంచి సేవించు నీ యిల్లాలి నిట్లీ దుఃఖానలంబునఁ బడఁద్రోసి పోఁదగునే? ఒకవేళ నావల్ల నెవ్వియేని లోపంబు లున్న మన్నించరాదా? కరుణఁ బాలింపరాదా? అకటా! ఇట్లీ ప్రాప్తి కలుగునంచుఁ దలఁపనైతివే? నీ వొక్కడవే త్రిదివంబున కేఁగుట న్యాయమా? నీ యర్ధాంగియగు నన్ను నీవెంట నేలకొని పోవైతివి? హా! ప్రాణేశ్వరా! నిన్నుఁబాసి నేనెట్లు జీవింపఁగలను! నా బ్రతుకడవినిగాచిన వెన్నెలాయెనే! హా! జీవితేశ్వరా! నిరంతరము నీ యడుగులకు మడుఁగులొత్తు భాగ్యంబింక నాకెట్లు లభింపఁగలదు? అకటా! మందభాగ్యులకు దైవంబు తోడుపడుటెంతైనఁగలదే? హా! నగసమూహములారా! దేవేంద్రుఁడు వజ్రాయుధంబుగొని మీ రెక్కలు ఛేదింపకమున్ను మీ రాకాశమార్గంబున నెగసి యిచ్చవచ్చిన స్థలంబుల వ్రాలునట్లు పతివెంటఁ జనలేని యీ యభాగ్యురాలి తలపై వ్రాలి సహస్ర శకలంబులు సేయుఁడు. ఆకాలమీకాల

మనకెల్లప్పుడుఁ బ్రవహించు నదీనదములారా! నన్ను మీలో ముంచివేయుఁడు. ఓ చండకరా! నన్ను నీ తీవ్ర కిరణంబులఁ దహింపజేయుము. సమీరణా! వైళంబ బోనిపోయి నన్ను నీ వెందేలి వార్లఁబడఁద్రోయుము. హా! హృదయేశ్వరా! కరుణాకరా! నిన్ను మఱవఁజాల! మఱవఁజాల!! హృదయమా! జన్మాంతరములవఱకు నెడతెగని యీ పతివియోగానలంబునఁ బడి దగ్ధమగుము! పంచప్రాణములారా! శరీరమును బాసి మీమీ తావులకుఁ జనుఁడు. హా! హృదయేశ్వరా! హృదయేశ్వరా!! (అని పతిపైఁబడి)

గీ. హా! మనోనాథ! హా! కాంత! హా! కృపాబ్ధి!
హా! జగజ్జనవందిత! హా! గుణాఢ్య!
హా! యశస్సాంద్ర! యఘదూర! హా! బలాఢ్య!
హా! కలానిధి సమతేజ! హా! సుశీల.

క. వలదంచుఁ దండ్రి నుడివిన
వలదని తల్లియును వగవ వలదని ఋషియుం
బలికినఁ జెలికత్తెలు మా
పలుకులు వినుమన్న వినని ఫలమాయిదియున్.

మఱియు,

గీ. మౌనివరుఁగాంచి యేను నమస్కరింపఁ
బలికె, 'దీర్ఘసుమంగలీభవ' యటంచు,
దపసి వరుడాడుమాట యథార్థమైన
దీవన బలంబు నేఁడిదే తెలియఁగలదు.

అకటా! ఆనాఁడు నారదమహర్షి మదీయ జనకుని సభా మధ్యంబున భవిష్యద్వృత్తాంతము నాలోచించి సత్యవంతునకు వివాహంబైన పిదప నొక్క సంవత్సరంబునకు మరణంబు సంప్రాప్తమగునని చెప్ప నంత మదీయజనకుండు గారాబుపట్టి

నగు నన్నుం జేరఁ బిలిచి 'అమ్మా! నీ వా సత్యవంతుని వివా
హమాడవలదు. నీకీ కారణంబు నారదమహర్షి చెప్పఁగలఁడు.
గాన మఱొక్కని వరింపు'మని యెన్నియో విధంబుల బోధించి
నను, మా జనని వలదని కన్నీళ్ళు పెట్టినను, మునివర్యుం డెంత
మాత్రమును గూడదని చెప్పినను, చెలికత్తెలు మా మాటలు
వినుమని యెన్నియో విధంబుల బుజ్జగించినను, నే నెంతమాత్రము
వారి మాటలు పాటింపక సత్యవంతుని దక్క నన్యుల వివాహ
మాడనని మోమోటము వీడి చెప్పితిని! ఎట్టకేలకు దేవర్షి
'ఓ రాజా! నీయమ భాగ్యంబు కతంబున నతఁడొక వేళఁ జిరా
యువుఁగలవాఁడగునేమో' యని పలికె. నంతఁ జేతనైన పని
గనుక మా తండ్రి నన్నితనికిచ్చి వివాహమొనర్చె, నది మొద
లుగా నిప్పటికొక సంవత్సరంబయ్యె. నాఁడు నారద మహర్షి
చెప్పిన గడువు దినంబునకే యీతఁడు మృత్యుండయ్యె.
అయ్యో! ఇప్పు డీతని బ్రతికించు వారెవ్వరు? నన్నోదార్చు
వారెవరు? అక్కటా! నే నెంత వెఱ్ఱిదానను. చచ్చినవారు
బ్రతుకుటెట్లు? బ్రతికించెడివారుండుటెట్లు? బ్రతికించెడివారే
యుండు పక్షమున మా పూర్వు లందఱు మాయిల్లు నిండి
యుందురుగదా! ఒకవేళ మదీయాదృష్టవశమున నీతఁడు పున
ర్జీవితుఁ డగునేమో! నే నొక్కమాఱా యిష్టదైవంబులఁ
గూర్చి ప్రార్థించెద.

సీ. చెలఁగి నా విభుఁ బునర్జీవితుఁ జేయరే
బాడబులార! దిక్పాలులార!
నా కాంతునకు వచనంబుల నీయరే
సురలార! మేటి కింపురుషులార!
నా మనోనాథుని నడువంగఁ జేయరే
తాపసోత్తములార! తారలార!

నా ప్రాణవల్లభు నాకు నొసంగరే
సాధ్యులారా ! సూర్యచంద్రులార !

గీ. దిక్కుమాలిన నావంటి దీనురాలి
పలుకు లాలింపరయ్య ! యపారగుణుని
సత్యవంతుని బ్రతికింపఁ జాలరయ్య !
వేగరారయ్య ! పతిభిక్షఁ బెట్టరయ్య !

[ అంత యముఁడు ప్రవేశించును. ]

యము:- [తనలో] ఆహాహా ! చంద్రమతీ, దమయంతీ మొదలుగాఁ గల మహాపతివ్రతామతల్లులు చనినవెనుక నెంతకాలంబున కీ పతివ్రతాతిలకంబు గనుపట్టె ! నేను మదీయభటులను రావించి ' మీరు మర్త్యలోకంబున కరిగి సత్యవంతుని ప్రాణంబులు గొని రం ' డని యానతిచ్చిన వార లో సమవర్తీ ! మేమిం కెచటికైన బోయెదము; గాని సత్యవంతుని ప్రాణంబుల చెంతకుఁ బోనొల్లము. ఏ మందు రేని పరమపతివ్రతాశిరోమణి యగు సావిత్రి మమ్మేమైన శపియించకపోదు. ఏతచ్ఛాపవిమోచనము సేయ మీ వల్లఁగాని, హరిహర బ్రహ్మాదులవల్లఁ గాని, కానేరదని దృఢముగా నొక్కి వక్కాణింప గలము. కావున మీరే పోయిరండు. మే మింకెచటికైనను బోయివచ్చెద ” మని చెప్పఁగా నే నిప్పుడు బయలుదేఱి రావలసి వచ్చెను. వచ్చినందులకు సత్యవంతుని ప్రాణంబులు గొంటి. మఱుఁగున నుండక నే నిప్పుడా ప్రతివ్రతాలలామకుఁ గనఁబడియే పోయెదను. ( అని రెండడుగులు ముందునకు వేయును. )

సావి :—(ఆతురతతో లేచి కరములు ముకుళించి) ఓ నీలాంబరధారా పురుషపుంగవా !

మ. పతి యస్తంగతుఁడయ్యె నింక నెచటన్ బాంధవ్యమా లేదు మ
త్పితయున్ మాతయు నత్తమామలును నెంతేవంత శుష్కింత్రు నా

గతి యిట్లయ్యెను దిక్కుమాలి యకటా! కారుణ్యమేపార మ
త్పతి ప్రాణంబు లొసంగుమయ్య యిదె నీ పాదంబులం బ్రాలెదన్.

(అని పాదంబులు పట్టుకొనఁ బోవును యముఁడు తప్పుకొనును)
ఓ దండధరా! ఇంచుక దయవుంచుదువేని నాదీన చరిత్ర మెల్లఁ
జెప్పుకొనియెద. వినుండు. నేను మద్ర దేశాధీశ్వరుండైన యశ్వ
పతి కుమార్తెను. సావిత్రి యను పేరఁ బరుగుదానను. విగత
రాజ్యుండై వనంబులఁదపమాచరించుకొను ద్యుమత్సేనుని కోడ
లను. సత్యవంతుని భార్యను. నేఁటి కాలంబున కకాలమృత్యు
వీతనిఁ దనవాఁత వేసికొనెను. నాయందు దయయుంచి పతిభిక్ష
పెట్టి రక్షింపుము.

యముఁ:—ఓ పరమ పతివ్రతాశిరోమణీ! సావిత్రీ!

ఉ. హేమలతాంగిరో! యిటుల నేటికి నేడ్చెదు ప్రాణనాథుకై
భూమిని సర్వజంతువులు పుట్టుటగిట్టుటకం చెఱుంగవా
ఏమి? సరే! యటుంచుమది యేమన! నీ ప్రపితామహాదులం
గోమలి! కాంచినావె? నిజ కూటమునం దెపుడైనఁ జెప్పుమా.

ఇదియునుం గాక,

ఉ. చచ్చినవారు వచ్చుటలు చానరో! కల్ల జగంబులందు నా
కచ్చెరువయ్యె నీదు చరితాంశముల న్వినఁ బిచ్చితల్లి! నీ
వెచ్చటనుండి వచ్చితివొ యేఁగుట యచ్చటి కద్భుతంబె; పో
చచ్చినవాని కేడ్చుటలు సాధ్వికిఁ జెల్లవు, ధైర్యమూనుమా.

చ. పదపద! యేటికిట్లు పతిప్రావునఁ జేరియు గోలపెట్టెదో
ముదిత! యధైర్యమేల? యిలఁ బుట్టిన వారలు చావకుందురే?
యిది తగదమ్మ నీకు సతి యెవ్వరొ! భర్తసుతాదు లెవ్వరో?
మదిఁ దలపోసి నీ విఁకఁ గ్రమంబగు మార్గము నాశ్రయింపుమా.

చ. చిలుకల కొల్కిరో! వినుము! చెప్పెద! నీ వది యేమటందువా
యిలఁగల సర్వజీవులకు నెవ్వరి కెవ్వరు లేరు తోలు బా

పద్మల తెరపైని యాటసుమి! మానక శ్రీహరిపాదపద్మముల్
దలఁచిసుఖంబు నొందుము యదార్థము సుమ్ము జగంబుమిధ్యయే.

ఉ. ఎందఱు చచ్చినారలో యికెందఱు చావఁగఁనున్న వారలో
సుందరి! వెంటనంటుకొని చూచుచు నుందువు జావు దేహి నీ
వెందుల కింతగా నిటుల నేడ్చెదు! శోకము మాని నీవు గో
విందుని వేడఁగాఁదగదె వేగము ముక్తిని బొంద భక్తితోన్.

అమ్మా! నీకింకొక్కటి చెప్పుచున్నాఁడ నది చక్కఁగాఁ వినుము.

చ. గరిత! యథావిధిం జరుపఁగానగుఁ గావున గర్మలన్నిటిన్
జరుపుము; మంటికేష్వరుము; శాశ్వతమైన పదార్థమెద్దియో
యరయుము; యింటికిర్జని రయంబున నత్తకు మామగారికిన్
బరమ ముదంబుఁ గూర్పఁదగు భక్తి నొనర్పుము పొమ్ముపొమ్మికన్.

సావి:—ఓ పురుషవరేణ్యా! ఇదియూ నీవు చెప్పు న్యాయము.

యము:—న్యాయము గనుకనే చెప్పితిని.

సావి:—అయ్యా! నీ వెవ్వరో మహనీయునివలెఁ గన్పట్టుచున్నాఁడవు.
నీ వృత్తాంత మించుక తెలుపఁగోరెదను.

యము:—సావిత్రీ! చెప్పుచున్నాను వినుము.

క. సమవర్తియంద్రు నన్నూ
యమ! నిక్కము దాఁపనేల యమియింపుదు భూ
తములన్ భువి; నీ పతి ప్రా
ణములం గొనిపోవ వచ్చినాఁడను జమ్మా.

(అని దక్షిణాభి ముఖుండై పోవుచుండును)

సావి:— (దుఃఖముతో) అక్కటా! మత్పతి ప్రాణంబులం గొని
యముండు దక్షిణాభిముఖుండై పోవుచున్నవాఁడు. అయ్యో!
నే నిప్పుడేమి చేయఁగలదానను. యము ననుగమించి ప్రార్థిం
చుటకంటె వేరొకటి లెస్సయగుమార్గం బొందు గానరాకున్నది. కావున
నో తల్లీ! సావిత్రీ! ఆపత్సముద్రమగ్నవై యున్న యీ దీను

రాలి పర్యాలోచించి నా జీవితేశ్వరుండైన సత్యవంతుని కళేబ
రంబున కట్టి [illegible]ము రావుండఁ గాపాడుము. నే నిదే పోవు
చున్నాను. (నిష్క్రమించును.)

(పిమ్మట యముఁడును, సావిత్రియుఁ బ్రవేశింతురు.)

సావి:— (ప్రాంజలియై) ఓ ధర్మరాజా! దీనబంధూ! దయాసింధూ!
సర్వంబెఱింగిన నీవే యిట్లుపదేశించి పోవుచున్న నా కెవ్వరు
దిక్కు. ఇదిగో! ఇటు వినుము.

శా. దూషింపంబడు సర్వమంగళములన్ దూరస్థురాలౌచుఁ బా
భాషింపంబడునే వితంతు వకటా! భూమండలంబందు నీ
వేషంబేను ధరించి పోఁగల నా వేశ్మంబునుం జేర సం
భాషింపం దొరకొన్న నెచ్చెలుల సమ్మానంబు లెట్లొందెదన్.

మఱియు,

సీ. పతియేకదా! భువిఁ బ్రమదాజనంబుల
కామ్యార్థములు గూర్చు కల్పతరువు
పతియేకదా! భువి సతులకెల్లరకును
భూరిసంపదలిచ్చు పుడుకు దొడుకు
పతియేకదా! భువిఁ బడఁతులమోహ సా
గరమును దాఁటించు గట్టి పుట్టి
పతియేకదా! భువి భామామణులకుఁ ద
త్వము నుపదేశించు దైవతముఁడు
గీ. కాంతుఁడే కద! స్త్రీల సద్గతుల త్రోవ
నాథుఁడేకద! వెలఁదుల నాణెమరయ
భర్తయేకద! చెలువల ప్రాణ మట్టి
మగఁడు లేనట్టి బ్రతుకేల? మగువకేంక?

యముః— సావిత్రీ!

ఆ. వె. కోరుమొక్క వరము కోమలాంగిరో పతి!
భక్తిఁ గాంచినంత బరము ముదము

పొందినాఁడ నిప్పు డొసఁగుమా దేని నీమ
విభుని జీవితమును విడచి పుచ్చి.

సావి:— పితృపతీ ! అట్లైన,

చ. అనిశము దానధర్మరతుఁడంచు జగంబునఁ బేరుఁగాంచి నాఁ
డనఘుఁడు సాళ్వదేశవిభుఁ డంధుఁడు శత్రులు పాఱఁదోల నీ
వనమున రాజ్యలక్ష్మిఁ బెడఁబాసి వసింపుచు నున్నవాఁడు స
జ్జనసుత లబ్ధచక్షుని*గ సల్పుము సంగ్రహ నేలుమా వెసన్.

యము:— అట్లే యొనరించితి. నీ వింక రాకుము. (పోవుచుండును)

సావి:— (వెంబడించి) ఓ సమవర్తీ ! పతులవెంట సతులరుగుట కెట్టి యాటంకములును లేవని వింద. మదీయ విభుండు మీ చెంత నున్నంతవఱకేను విడిచి పోఁ జాలను.

యము:— (వెనుకకుఁ దిరిగి)

ఉ. పోవఁగ దుర్లభంబిఁకను ముద్దియ నిర్బ్రము ! ముందు ముందు నీ
వేవిధి దాఁటనోపుదువె యిర్వనభూముల శైలరాజి నెం
తే నడిఁబాఱు నేఱులను దెల్లము నీ విభుఁడింక రాఁడు పో
భావుక మీఁదినంబు నినుఁబాసె నికేటికిఁ గష్టమూనుటల్.

సావి:— ఓ దండధరా !

చ. స్మృతులితిహాసముల్ శ్రుతులుఁ జెప్పుచునుండుట నీ వెఱుంగవే?
పతియొకదా వడంతులకుఁ బ్రాణము దైవమటం చనారతం
బు తరణిపుత్త్రి ! న్యాయమె ? సుబుద్ధులు మాటికి మెత్తురేకటా !
పతి చనుచుండఁ బోదగదె భార్యసపర్యలొనర్ప వెంబడిన్.

యము:— సావిత్రీ ! నీ వాక్యంబుల కెంతయు సంతసించితి. సత్యవంతుని ప్రాణంబులుదక్క-ఁ దక్కిన వరంబేదేని నొకటి కోరు మిచ్చెద.

సావి:- సమవర్తీ ! మచ్ఛ్వశురుండు విగతరాజ్యుండు గాన, వారల రాజ్యంబు ననుగ్రహింపుఁడు.

యముఁడు:- అటులే యొసంగితి. ఇంక మీఁది తెరువ నగమ్యము. వెనుకకు మరలి పొమ్ము. (అని పోవుచుండును.)

సావి:- (వెంబడించును)

యము:- (వెనుకకుఁ దిరిగి చూచి) సావిత్రీ ! రావలదు ! రావలదు !! ఇదియే నాకును భూలోకంబునకుంగల సరిహద్దగుటం జేసి.

గీ. తీవ్రవేదనఁ గలిగించు తేళ్ళ గములు
బుస్సుబుస్సని పైఁబడు భుజగతతులు
కంటక పథంబు లసిపత్ర కాననంబు
లవిగో ! యెటులున్న వోమాడు ! మజ్జనయన.

(పోవుచుండును)

సావి:-(వెంబడించుచు) మార్తాండతనూజా ! ధర్మరాజా ! పతిభక్తి బలోపేతనగు నన్నీ తేళ్లేమి చేయఁగలవు ? పాములేమి చేయఁ గలవు ? ఏల నన్నిట్లీవు భయపెట్టెదవు ?

యము:-సావిత్రీ ! నీ వింతటనుండియైనను వెనుకకు మరలిపొమ్ము.

(పోవుచుండును)

సావి:-పతివ్రతలకు దుర్గమంబు లెందైనఁ గలవే ? నీ వెఱుంగని ధర్మంబులుం గలవే ? (పోవుచుండును)

యము:-(వెనుకకుఁ దిరిగి) సావిత్రీ ! నీ భక్తి సాహసంబుల కెంతయు మదీయమనం బానంద భరితంబయ్యె. సత్యవంతుని ప్రాణంబులు దక్క నే దేని నింకొక వరంబుగోరు మిచ్చెద.

సావి:-పితృపతీ ! మద్రదేశంబును బరిపాలింప మదీయ జనకుం డపుత్త్రకుండు గావున సుతశత లాభంబను గ్రహింపుఁడు.

యము:-అటులనే యిచ్చితి. వెడలు మింక. నీవు రాఁదగదు. (పోవుచుండును)

సావి:—(వెంబడించుచుండును)

యము:—(వెనుకకుఁ దిరిగి చూచి) ఏమీ! నే నిన్నివిధంబుల బోధించినను వినక నీ విట్లరుగు దెంచుచుంటివి! ఇదిగో! ఎట్టు లున్నదో చూడు!

గీ. క్రొవ్వు, రేతస్సు, మూత్రము, గులిమి, మలము,
చీమిడియు, నశ్రువులు, పుసి, చెమట, నల్ల,
మెదడు, తెమడ నాద్యంబులౌ మేధ్యములను
నిండి ప్రవహించు వైతరణీ స్రవంతి.

ఇట్టి హేయంబైన నదినిఁ గాంచి సమీపించుట యెంతకష్టమో దీనిఁ దాఁటుట కంతకన్న వేయిమడుంగు లెక్కుడు కష్టము. మఱియు,

గీ. ఉవిద! నిలునిల్వు మీ విటనుండి మాను
పొంగినయి మీఁద రాఁగూడ దమ్మయింక
నేమొ వచియించినానని యెంచఁబోకు
నమ్ము నామాట వేదాతురమ్ము పొమ్మ.

(అని, నదిని దాఁటి పోవును)

సావి:—అయ్యో! యముండు ననాయాసంబుగ దాఁటిపోయె నేనిప్పుడీ వైతరణీనది నెట్లు దాఁటుదును? (అని కొంత తడవాలోచించి, కనులు మూసికొని)

గీ. దైవ సముఁడంచుఁ బతినాత్మఁ దలఁతు నేని
శివుని యిల్లాలి నెప్డుఁ బూజింతు నేని
సత్యమాధారమని నమ్మ సాధ్వి నేని
దారియిమ్మఁ గాక నాకు వైతరణి నేఁడు.

(అని దాఁటి పోవును)

(తెరపడును)

చతుర్థాంకము సంపూర్ణము.

---

శ్రీ ర స్తు

# సావిత్రీ సత్యవంతీయము

## పంచమాంకము

(యమలోక సమీపారణ్యములోని కిరువురు యమకింకరులును జీవుఁడును ప్రవేశింతురు)

జీవు:—(తనలో) దానమునక, ధర్మమునక, పుణ్యమునక, పాపమునక సంచరించిన నన్ను యముఁ డెంతగా శిక్షించునో కాని యిప్పు డీ యమదూతలు పెట్టు బాధలు మాత్ర మనుభవింపఁ జాల కున్నాను. వీనల కేమైన లంచంబు లిచ్చి తప్పించుకొను మార్గం బులుండిన యెడల బాగుండెడిది. నే నెంత మంది యుద్యోగు లకు లంచంబులిచ్చి వ్యాజ్యంబులలో నా కనుకూలంబుగనుండు నట్లు తీర్పులు వ్రాయించుకొనలేదు! అయ్యో! నే నిప్పుడేమి చేయుదును!

కింక:—రా! రా!! ఎందుల కీ గొడవ ? (లాగుదురు)

జీవు:—కింకరులారా! మీ కొక నమస్కారము. నా కొమరునితో నొక్కమాట చెప్పి వచ్చెదను. నన్ను లాగకుడు. (అని, వెను కకు రెండడుగులువేసి) ఓరీ! నిర్భాగ్యదామోదరా! నిరక్షర కుక్షీ! మనము లోకుల కియ్యవలసిన వాని కేకాగితములును లేవు, మనకు రావలసినవాని కన్నింటికిఁ బత్రంబు లున్నవి. వాయిదాలు మట్టుకు జాగ్రత్తగాఁ జూచుకొనుచుండుము. ఎవరిని నమ్మినను నమ్మకపోయినను, ఊరిలోఁ గరణముగారిని మట్టుకొకకంటఁ గనిపెట్టియుండుము. పైకెంత మంచిగా మాట్లాడినను, ప్రక్కలోఁ ద్రాఁచై సంచరించును. పడమ టింటిలోఁ జల్లగుంజ ప్రక్కనఁ బాతిపెట్టిన రూపాయిల

కుండను మట్టు కప్పుకప్పుచు బయటికిఁ దీసి చూచుకొను చుండుము. లేనియెడల గొలుకలు తమ కన్నములగుండఁ బ్రక్క-యింటి వానికిఁ జేర్చును. బ్రాహ్మణుల కొక్క- దమ్మిడీయైనను నీయకుము.

కింక:— [ లాగుదురు. ]

జీవు:— లాగకుఁడు ! లాగకుఁడు !! [ అని కూయుచుండును ]

కింక:— లే ! లే !! [ తన్నుదురు ]

జీవు:— అయ్యో ! అయ్యో !! తన్నకుఁడు ! తన్నకుఁడు !! [ అని పెద్దపెట్టున ] ఓ రబ్బో ! ఓ రయ్యో !! ఓరి బాబో !!! ఈ యమదూతలు నన్ను హింసించుచున్నారు. రండ్రో ! [ అని యేడ్చును ]

కింక:— నీ విప్పు డేడ్చిన నేమి ప్రయోజనము ? 'చేసికొన్న వారికిఁ జేసికొన్నంత మహాదేవా' యను నార్యోక్తి వినవా ? రా ! పోవుదము. [ లాగుదురు ]

( అంత ధర్ముఁడు ప్రవేశించి )

ధర్మ:—కింకరులారా ! వీని నిప్పుడేల యింతగా బాధించెదరు ? వీడెంత పిసినిగొట్టు వీనుఁగైనను, బ్రతికియున్న రోజులలోఁ బిడికెడు తోఁటకూర కాడలొక బ్రాహ్మణునకు బుద్ధిపూర్వకముగా దానముఁ జేసియున్నాఁడు. కావున వీనిని శ్రమపెట్టక తీసికొని పొండు.

జీవు:—(తనలో) పిడికెడు తోఁటకూరకాడకే నా కిప్పు డడ్డుపడ, ధన ధాన్యాదు లొసంగిన వారి సంగతి నేమనిచెప్పఁ గలను ?

కింక:—ధర్ముఁడా ! అటులే యొనర్చెదము. మే మిచ్చట నొకక్షణమైన నుండుటకు వలనుపడదు. త్వరితగతిఁ బోవలసియున్నది.

ధర్మ:—అటులైన నే నిదే పోవుచున్నాఁడ (నిష్క్రమించును)

కింక:—(జీవునిఁ జూచి) నీ కా ధర్ముఁడే వచ్చి యడ్డుపడనిచో నీ పాట్లు

మఱక్కులైనను బదులివి కావు. రా! పోవుదము. (చేయిపట్టి కొందురు)

జీవు:—కింకరులారా! ఇదిగో! ఇటు వినుఁడు.

కింక:—మళ్ళీ యేమిటది వచ్చినావే? త్వరగాఁ దెల్పుము.

జీవు:—తెల్పవలసిన దేమున్నది?

గీ. కాలు దూతలు పాపాత్ముని కేలుబట్టి
లాగి దండించునప్పుడు వాగుచున్న
జీవునకుఁ దోడు నీడయై చేరినిలిచి
కాచునది వాని ధర్మ మొక్కటియె సుమ్ము.

అను 'నిగమోక్తి' ననుసరించని నే నిప్పు డేమిచేయఁగలను? మీ రేమిచేసినను సరే! మీ చరణదాసుఁడను. (అనినమస్కరించును)

కింక:—సరే! చాలుఁ జాలు నీ నక్కవినయములు. పోవుదమురా! (ఈడ్చుకొని పోవుదురు)

ఇది విష్కంభము.

---

[స్థలము: యమపురము. యముఁడును వెనుక సావిత్రియుఁ బ్రవేశింతురు

యము:— (తనలో) ఆహా! ఏమి యీమె ప్రభావము! దుర్గమారణ్యంబులును, భూరిశైలంబులును, అసిపత్రవనంబులును, గంటకపథంబులును గడచివచ్చుటయేగాక, చివరకీవైతరణీమహానదినిగూడ ననాయాసముగా దాఁటి నాలోకమునకే వచ్చినది. నే నిప్పుడీమెకు నా కింకరులను జూపించి భీతిఁ గలిగించెద.

సావి:- కృతాంతా !

ఆ. వె. ఏడు మాటలాడిరే నెట్టివారైన
బంధులగుదు రార్యసర్గమునకుఁ
గాన నేను మీకుఁ గడుసమీపస్థనౌ
బంధురాల దీర్ఘ భాషణమున.

యము:- [ విని విననట్లుగా నటించుచు ] సావిత్రీ ! ఇటుచూడుము.

సీ. పరకాంతలను బట్టి బాధించు నీచుల
కరములు గోళ్ళ నఱకువారు
కూటసాక్ష్యముఁజెప్పు కూళలనాలుకల్
గొనకొని కత్తులఁ గోయువారు
బ్రహ్మహత్యలఁజేయు పాపులగాత్రముల్
చేబాడిసలఁబూని చెక్కువారు
ఇచ్చెద రమ్మని యీని కుత్సితుల, గొం
తులు గట్టిగాఁ బట్టి నులుమువారు
గీ. పశువులకు మందుపెట్టిన పామరులను
గొంపలకు నిప్పుపెట్టిన తెంపరులను
బట్టి తలక్రిందుగా ముండ్ల చెట్టులకును
వ్రేలగట్టెడు మద్భట శ్రేణిఁ జూడు.

మఱియు,

గీ. అంధకూపంబు, సారమేయాదనంబు
కాలసూత్రంబు, తప్తోర్మి, కోలముఖము
వజ్రకంటక శాల్మలి ప్రాణ రోధ
మాదిగాఁగల నరకంబు లవిగో చూడు!

నీ విట్టి భయంకర లోకంబున నుండఁదగవు. గాన వైళంబ చనుము. నేను మదీయస్థానమునకుఁ బోయెదను.
(అని పోవును)

[ తెరపడును ]

## ద్వితీయరంగము.

(యముని యాస్థాన మంటపము. యముఁడు, చిత్రగుప్తుఁడు సింహాసనాసీనులై యుందురు)

[తెర యెత్తఁబడును]

యము:- చిత్రగుప్తా! ఈదినంబున విచారింపవలసిన జీవులను గింకరులిచటికిఁ దోడ్కొనివచ్చినారా?

చిత్ర:- చిత్తము. (కింకరులను జూచి) కింకరులారా! మీ రా జీవులనిటు తీసికొనిరండు.

కింక:- [కొందఱు జీవులను దీసికొనివచ్చి నిలువఁ బెట్టుదురు.]

చిత్ర:- (లేచి) ధర్మరాజా! ఇటు వినుఁడు. (జీవులను జూపించి)

చ. గొఱియలఁ బందిపిల్లలను గోళ్లను మేఁకల దున్నపోతులం
బోరిఁబోరిఁ బట్టితెచ్చి మముఁ బ్రోవుమటంచును ముద్దుగట్టి యు
న్గుఱి నిగుడించి దేవతలకుం బలియిచ్చిన పాపకర్ములీ
యఱువదిమందికిం దగినయట్టుల శిక్షవిధింప వేఁడెదన్.

యము:- కింకరులారా! వీరల నిరయంబునకుం దోడ్కొని పోయి కంఠంబులు ఖడ్గంబులచే ఖండించి తద్రక్తంబు మీ యిచ్చ వచ్చిన విధంబునఁ బానము సేయుఁడు.

కింక:- చిత్తము (అని జీవులతో నిష్క్రమించి తిరిగి జీవులతోఁ బ్రవేశింతురు.)

చిత్ర:- దేవా! (జీవులను జూపించి)

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి సతిని
వీడి వేశ్యను మరగినవాఁడు వీఁడు
మగనిఁ గాదని పెక్కండ్ర మగల మరగి
పెంకెతనమునఁ దిరిగె నీ యంకులాఁడి.

యము:—కింకరులారా! వీర లిద్దరిని గోరడాలతో మోదుచుఁ దీసి
కొనిపోయి వహ్నితప్తంబులగు నుక్కు ప్రతిమల నాలింగనము
సేయునట్లు చేయుండు.

కింక:—చిత్తము. [జీవులతో నిష్క్రమించి తిరిగి జీవులతోఁ బ్రవేశింతురు]

చిత్ర:—దేవా! [జీవులను జూపించి]

గీ. అతిథు లభ్యాగతులు రాఁగ నన్నమిడక
తలుపులు బిగించి భుజియించు తులువవీఁడు
తల్లి దండ్రులకును విప్రతతికిఁ గీడు
సల్పి చరియించినట్టి ముష్కరుఁడు వీఁడు.

యము:—కింకరులారా! మొదటి వానిని క్రిమిభోజనంబను నరకంబునఁ
బదివేలయేండ్లుంచుఁడు. రెండవవానిని గాలసూత్రంబను నరకంబునఁ బశురోమ సంఖ్యగల వర్షంబులుంచుఁడు.

కింక:—చిత్తము. (జీవులతో నిష్క్రమించి తిరిగి యొక స్త్రీ జీవితోఁ బ్రవేశింతురు)

చిత్ర:—దేవా! (స్త్రీ జీవిని జూపించి)

ఉ. ఉన్నవి లేకయున్నవియు నుమ్మలికించుచుఁ బుత్త్రితోడఁ దా
నన్నియుఁ గోపమెక్కునటులాడి కరంబులఁ జాచి కోడలిం
దన్నుల పాలుఁ జేయుచు విధాతను దూఱుచు మాటిమాటికిం
గెన్నియొ ఘోరకృత్యముల నీపె యొనర్చిన దేమి చెప్పుదున్.

యము:—కింకరులారా! ఈ పాపురాలిని దర్జనభర్జనలచే నలయించుచు
దామిస్రంబను నరకంబునఁ బెక్కువేల వర్షంబు లుంచుఁడు.

కింక:—చిత్తము. (స్త్రీజీవితో నిష్క్రమించి తిరిగి యొక పురుషజీవితోఁ బ్రవేశింతురు)

చిత్ర:—దేవా! :— (అని జీవుని జూపించి)

గీ. గుళ్లు వాహనశాలలు గోపురములుఁ
బుస్తకాగారములు, సత్రములుఁ దటాక

తోఁటలు, వనములు, బావులను త్రవ్వించుటయుఁ
గాఁ [illegible] నొసంగిన కరణీయుఁడు.

యముఁ:—కింకరులారా! వీని మేని చర్మంబు లొలిపించుచుఁ బండ్లూడఁ
గొట్టించుచుఁ గన్నులూడఁ బెఱికించుచుఁ దీసికొనిపోయి కుంభీపాకం
బను నరకంబునంగల తప్తతైల ఘటంబులలో నుంచుఁడు.

కింక:— చిత్తము. ( జీవులతో నిష్క్రమించి తిరిగి మరికొందఱు స్త్రీ
పురుష జీవులతోఁ బ్రవేశింతురు )

చిత్ర:—దేవా! (ఒక్కొక్కరిఁ జూపుచు)

సీ. కన్నకుమారుఁన కన్నంబులో నాభి
కలిపిపెట్టిన యట్టి కఠినురాలు
సవతి పుత్త్రిని బట్టి జంపి మాంసము వండి
భర్తకుం బెట్టిన పాపురాలు
పంక్తిభేదముఁ జేసి వారివారికె ముందు
వడ్డించునట్టి దౌర్భాగ్యురాలు
మగని వశ్యుని జేయ మందు మూత్రంబుతో
నూఱి పెట్టినయట్టి ధీకురాలు

గీ॥ స్త్రీల బలిమిని జెఱగొన్న చెనఁటివీఁడు
భార్య నూరక కొట్టిన పాపివీఁడు
బంగరము దొంగిలించిన దొంగవీఁడు
గురువునకు నామమిడిన ముష్కరుఁడు వీఁడు.

యము:— కింకరులారా! ఈ నలువురు స్త్రీలను మహారౌరవంబను
నరకంబున శతసహస్రవర్షంబు లుంచుఁడు. ఈ నలువురు
పురుషులను నవీచీ యను నరకంబునఁ బదివేల సంవత్సరంబు
లుంచుఁడు.

కింక:— చిత్తము. ( జీవులతో నిష్క్రమింతురు )

యము:- చిత్రగుప్తా ! ఈ దినంబున విచారింపఁబడినవా రెందఱైన నుండిరా ?

చిత్ర:- దేవా ! ఇం కెవ్వరును లేరు. సెలవు. [నిష్క్రమించును]

[ అంత సావిత్రి ప్రవేశించును. ]

సావి:- [ యమునిఁ జూచి ] సమవర్తీ ! సమస్తజీవులయందును సమబుద్ధిగలవాఁడ వగుటంజేసి సమవర్తి యను నామంబునఁ బిలువంబడు చుంటివి. నాయందుఁ గరుణవహించి సత్యవంతు ప్రాణంబులొసంగి నన్నుం బుత్తెంచుము.

యము:-సావిత్రీ! ఇంకను నీ మగనిపై నాసపెట్టుకొనియే యుంటివా? అది యెంతయుఁ గలలోని వార్త. ఇదివఱ కిచ్చిన వరత్రయంబుతోఁ దృప్తినొంది మరలుము.

సావి:-ధర్మరాజా! నే నెన్నివిధంబుల వేఁడినను, వినక పెడచెవిని బెట్టుచు నీవట్టిమాత్రమున విడువకుంటివి. ఇదిగో! ఇటువినుము. మానభంగమొనరింపఁగా నెంచి యేతెంచిన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల,ననసూయాదేవితన పాతివ్రత్యమహిమంబుచేఁ బసి బాలురంజేసి తొట్టియలోఁ బరుండబెట్టి జోలపాడిన సంగతి నెఱుంగవా ? మోహాంధకారంబునఁదన్నుముట్టవచ్చిన కిరాతుని దమయంతీదేవి భస్మమగునట్లు శపించిన సంగతి మఱచితివా ? విశ్వామిత్ర ప్రేరేపితమగు కారుచిచ్చును చంద్రమతీదేవి తన పాతివ్రత్య మహిమంబుచేఁ జల్లారు నట్లొనర్చిన సంగతి జ్ఞప్తికి లేదా ? మాండవ్య మహాముని తన నాథుని శిరంబు సూర్యోదయంబగుసరికి సహస్రభిన్నంబులై భూమిం బడుఁగాక యని శపింపఁగా. సూర్యుం డుదయింపకుండునట్లొనర్చిన సత్యవతీదేవి ప్రభావంబును మఱచితివా? పతివ్రతలనఁగా నేమిగాఁదలంచు చుంటివి ?

యము:-(సింహాసనమునుండి దిగి గజగజవణకుచు హీనస్వరముతో) నీ విభునిమాత్రము నీవు వడయఁజాలవు.

సావి:-( కఠినముగా ) ఏమీ! నావిభుని నీవు విడువఁజాలవా? ఎంత కర్ణకఠోరముగా బలుకుచుంటివి! సూర్యనందనా! శమనా! ఈ నా కడసారి పలుకులు చక్కఁగా నాలకింపుము పతిభక్తి పరాయణనగు నాకీ పతివియోగంబు దప్పదేని బ్రహ్మ సృష్టియొనర్పఁ గలఁడా! సూర్య చంద్రులు సంచరింపఁగలరా! నక్షత్రంబులు ప్రకాశింపఁగలవా! చతుర్దశ భువనంబు లుండఁ గలవా! అగ్ని ప్రజ్వలింపఁగలఁడా! వాయువు వీవఁగలఁడా! నీ వీ సింహాసనంబునఁ గూరుచుండి జీవులను విచారింపఁగలవా! కాలచక్ర మొకచుట్టయినను తిరుగఁగలదా! నదులు ప్రవహింపఁగలవా! [అని కొంచెముండి] పితృపతీ! నీ వింతటనైనను నా విభుని నా కొసఁగి నన్ను సంతోషపెట్టుము. లేదేని యిదిగో! యిటు వినుము. [అనిఏమేమోయనఁబోవును]

యము:- [మహా భయముతో ]సావిత్రీ! సావిత్రీ!! తొందర పడకుము! తొందరపడకుము!! నీ యిచ్చవచ్చిన వరం బేదైనఁ గోరు మిచ్చెద.

సావి:- ధర్మరాజా! ఇంతకు మున్ను మీరు సత్యవంతుని జీవితమును దక్క నేదేని నొక వరంబుగోరు మిచ్చెదనని చెప్పుచూ వచ్చితిరి. ఇప్పుడది లేదు. కావున నా కా వరం బనుగ్రహింపుఁడు.

యము:- ఓ పరమపతివ్రతాశిరోమణీ! సావిత్రీ!

గీ. కొనుమిదే నీకు నొసఁగితిఁ గూర్మిమగని
బ్రతుకునింకఁ జతుశ్శతాబ్దములు వీడు
క్రమముగాఁ గాంచు నూర్వుర విమలయశుల
శూరులనఁదగు పుత్త్రుల సుదతి పొమ్ము.

ఇదిగో! కన్నులు మూసికొనుము. రెప్పపాటు కాలములో నీ విభుశరీర మున్నచోటికిఁ జేరఁ గలవు.

సావి:- [ కన్నులు మూసికొనును ]

(తెరపడును)

## తృతీయరంగము

(సావిత్రి సత్యవంతుని శిరంబును దన తొడపైని నిడుకొని కూర్చుండి యుండును) (తెర యెత్తఁబడును)

సత్య:—(అటు నిటు పొరలును)

సావి:—ఆహా! ఇప్పటికిఁ గదా నేను ధన్యురాలనైతిని.

సత్య:—(బలవంతముగాఁ గన్నులు విప్పి చూచును)

సావి:—హృదయేశ్వరా! హృదయేశ్వరా!! (అని పిలుచును)

సత్య:—అబ్బా! అబ్బా!! ఎట్టి యిక్కట్టుల పాలైతిని. (అని లేచి, సావిత్రిం జూచి) హృదయేశ్వరీ! యమపాశ బద్ధుండనైన నే నెట్లు తిరుగ బ్రతుకఁగలిగితి?

సావి:—జీవితేశ్వరా! మీ కా విషయంబు సవిస్తరముగా నెఱింగింతు. మీరు కడు బడలి యుంటిరి. ఈ రేయి యిచ్చటఁ గడపి రేఁపేఁగుదము. కొంతతడ విచ్చట విశ్రమింపుఁడు.

సత్య:—సతీమణీ! ఇప్పుడర్ధరాత్రమైనది. నాతలిదండ్రు లెంతగా మనలను గూర్చి విలపించుచుండిరో! మన మిప్పు డాలస్యము చేయక యాశ్రమంబునకుఁ బోవుదము రమ్ము.

[నిష్క్రమింతురు] [తెరపడును]

---

## తురీయరంగము

[స్థలము—పర్ణశాల, భానుమతీ ద్యుమత్సేనులు] [తెరయెత్తఁబడును]

ద్యుమ:—[తనలో] హా! పుత్రీ! విరోధిలతాలవిత్రా!

ఉ. నిద్దుర లేచినంతటనె నీవు సపర్య లొనర్ప నుందువో
ముద్దుల పుత్త్రికా! విపిన భూముల నీ విధి నిన్నినాళ్ళు మా

యిద్దఱికోసమిూవెగడ యిక్కటులం బడుచుంటి వన్న ! యీ
ప్రొద్దు నిశీథిమైనను మముం గనఁజేరవదేమికోవమా ?

( భార్యపంకఁ జూచి ) హృదయేశ్వరీ ! కొడుకును, గోడలు
నీ దినంబున నింతవఱకుఁ బర్ణశాలకుఁ జేరరైరి. కోడలిప్పటికి
భుజించి నాల్గు దినంబు లగుటం జేసి యేమైన విపత్తు సంభవించి
యుండెనా ? లేక భగవంతుండు నాకీ దృష్టి ప్రసాదించి
నన్నేమైనఁ బరీక్ష యొనర్ప సంకల్పించి యుండెనా ? యని
నామనంబునకు సందియంబు గలుగు చున్నది.

భాను:- హృదయేశ్వరా ! కడు ముదుసలులమైన మనలఁ బాసి యొక
నిముసమైన నుండని కొడుకును, గోడలు నింత వఱకు రాకుండు
టను జూడ నేదో ముప్పు వాటిల్లి యుండుననియే నాకును
దోఁచుచున్నది. లేనిచో నేటికి రారు ?

ద్యుమ:- హా పుత్రా ! సత్యవంతా ! [అని దిక్కులువరికించి] ఏమీ!
ఎటు చూచినను వచ్చుచున్నట్లు కాన్పింపదు. అయినను,
నే నిట్లు ప్రశ్నించి చూచెద.

సీ. సంయమీశ్వరులార ! సత్యవంతుని జాడ
దెలిసిన నొక్కింత తెలుపరాదె ?
శైలబృందములార ! సత్యవంతుని జాడ
దెలిసిన నొక్కింత తెలుపరాదె ?
సకల వృక్షములార ! సత్యవంతుని జాడ
దెలిసిన నొక్కింత తెలుపరాదె ?
సరసీగణములార ! సత్యవంతుని జాడ
దెలిసిన నొక్కింత తెలుపరాదె ?

గీ. శారికా కీర బర్హిణ చక్రవాక
బక కపోత పారావత పంక్తులార !

నేడు మా సత్యవంతుని జాడమీకుఁ
దెలిసి యుండిన నెక్కింత తెలుపరాదె ?

హా ! తండ్రీ ! జగన్మోహనాకారా ! కదల మెదల లేని కడు ముదుసలుల మైన మమ్ము నీ యరణ్యంబున డించిపోయి తివే ! నా మొఱాలకించిన వారొక్కరైనను లేరే ! ఓ సర్వ రక్షకా ! నీవేదిక్కు ! నీవే తోడు ! నీవేనీడ ! (అని నివ్వెఱ పడి చూచుచుండును.)

( అంత సావిత్రీ సత్యవంతులు ప్రవేశింతురు. )

ద్యుమ:- ( సత్యవంతుని గౌఁగిలించుకొని) నాయనా ! సత్యవంతా ! ఇంత ప్రొద్దుపోవుదనుక వనంబులో నేమిసేయు చుంటిరి ?

సత్య:- తండ్రీ ! పండ్లును, దర్భలును గోసి యొక్కచో భద్రపఱచి కాష్ఠంబుల భేదించు నెడం గలిగిన శిరోవేదనంబునకు నిలువలేక పుడమిపైఁ గొంచెము సేపు విశ్రమించితినో లేదో కాని యముం డప్పటి కప్పుడు నన్నుం దన పాశబద్ధునిం జేసెను.

ద్యుమ:- ( ఆశ్చర్యముతో ) నాయనా ! సత్యవంతా ! అట్టి నీ వెట్లు మగుడ రాఁగలిగితివి ?

సత్య:- తండ్రీ ! మీ కా విషయంబు మీ కోడలు సవిస్తరంబుగా జెప్పఁ గలదు.

సావి:- మామగారూ ! ఇటు వినుఁడు. మీ తనయున కీ దినంబున మరణంబు సంభవించునని నారదమహర్షి మున్ను నా కెఱిం గించుటం జేసి నే నీ దినంబున నీతని నేమఱి యుండరాదని తలంచి మీ యనుజ్ఞ వడసి యీయనతో వనంబున కరిగితిని. అచ్చట మే మిరువురము కొంత తడవు వనవిశేషంబులఁ జూచుచుఁ బ్రొద్దుపుచ్చి, తిరిగి పర్ణశాలకు బయలుదేఱు సమ యంబున, యముండు సనుదెంచి మీ కుమారుని ప్రాణంబు లం గొని దక్షిణాభిముఖుండై పోవుచుండెను. అప్పుడు నేను

యము ననుగమించుచు ననేకవిధములఁ బ్రార్థింప, నతఁడెట్టకేలకు దయార్ద్రహృదయుండై నాకు నాలుగువరంబులనుగ్రహించె.

ద్యుమ:— ( ఆతురతతో ) తల్లీ ! ఆ వరంబు లెయ్యవి ?

సావి:— మహాభాగా ! ఒక వరంబున నీతఁడు సజీవుండయ్యె. రెండు వరంబులు, మీకుఁ బోయినదృష్టియు, నపహృతరాజ్యంబును ప్రాప్తించుటకు హేతువులయ్యె, నొకవరంబు మదీయజనకునకు సుతశత లాభంబు గలుగుటకుం గారణంబయ్యె.

ద్యుమ:— ( మహానందముతో ) తల్లీ ! సావిత్రీ !

గీ. వివిధ విధములఁ గష్టించి పితృపతిని ను
తించి సాళ్వరాట్కుల మంతరించకుండఁ
బుడమిఁ బునరుద్ధరించిన పూజ్యురాల
వమ్మ నీ కథ కీర్తనీయము ధరిత్రి.

సత్య:— హృదయేశ్వరీ ! ఎట్టి ధీరురాలవు ! ని న్నేమని కొనియాడుదును.

సీ. మునిదారతోనైన ముచ్చటించని నీవు
యమునితో నెట్లు మాట్లాడినావు !
నలుసు కాలికిసోక నడువనేరని నీవు
ముండ్లత్రోవల నెట్లు పోయినావు ?
నిష్కుటంబులఁ జూచి నివ్వెఱపడెడు నీ
వసిపత్రవనము నెట్లరసినావు !
కాసారములుగాంచి కడుభీతిపడు నీవు
తద్వైతరణి నెట్లు దాఁటినావు ?
గీ. భీకరాకార తీవ్ర దంష్ట్రాకరాళ
కాలజీమూత సన్నిభగాత్ర, కాల
పాశ దండధరోద్దండ పాణులైన
కాలుదూతల నీ వెట్లుగాంచినావు.

( అంత, సుబుద్ధి ప్రవేశించును )

సుబుద్ధి:— ద్యుమత్సేనమహారాజా ! నమస్కృతులు.

ద్యుమ:— సచివాగ్రేసరా ! సుబుద్ధీ ! (అని కౌఁగిలించుకొని) ఎంత కాల మెంతకాలమునకు మరల నిన్నుఁగాంచి సంతసించు భాగ్యంబు లభియించినది. తండ్రీ! నీవేమికార్యార్థివైవచ్చితివి?

సుబు:— దేవా ! ఇటు వినుఁడు. తమ ప్రత్యర్థియైన విజయసింహుని పరిపాలనంబునకెంతయుఁ గినిసి ప్రజలాతని శాసనంబుల నుల్లంఘించుటఁజేసి చేయునదిలేక యతఁడు నిన్నటిరాత్రి సకుటుంబముగా నెచ్చటికో పాఱిపోయెను. దానంజేసి ప్రజలెల్లరు రాజ్యపాలనం బొనర్చుటకు మిమ్ముం దోడ్కొని రమ్మని నన్నుం బుత్తెంచియున్నారు. భద్రగజంబును దీసికొనివచ్చి సేనానులిందే యున్నవారు, గావున తమరు సకుటుంబముగా సత్వరము బయలుదేఱి రావలయునని ప్రార్థించు చున్నాఁడను.

ద్యుమ:— మంచిది. అటులే పోవుదము. ఇంకఁ గావలసినదేమి ?

సత్య:— గీ. కలహములుమాని న్యాయమార్గమునరాజు
లుర్విఁ బరిపాలనముసేయు చుండ్రుగాతఁ
బరమ సుచరిత్ర సావిత్రి వనితవోలె
ప్రేమ భర్తల స్త్రీలు సేవింత్రుగాత !

సుబు:— తథాస్తు ! (అందఱు నిష్క్రమింతురు. )

పంచమాంకము — సంపూర్ణము.

గద్యము :

ఇది శ్రీ కంటముక్కుల వంశపయఃపారావారరాకాసుధాకర గౌతమస గోత్రాపస్తంబసూత్ర లక్ష్మీకాంతయామాత్య జ్యేష్ఠ పుత్ర వేంకటజానకీరామశర్మాభిధేయ ప్రణీతంబైన
సావిత్రీ సత్యవంతీయ నాటకము
సంపూర్ణము.

# శుద్ధి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 3 | పరిమిళ | పరిమళ |
| 5 | 16 | డవనము | జీవనము |
| | 18 | నాకోశము | ఆక్రోశము |
| 6 | 20 | మహార్ణ | మహార్ణ |
| | 21 | కిత్రణి | కీర్తిని |
| 11 | 26 | ప్యంబువక | ప్యంబునఁగ |
| | 27 | దారా | దార |
| 12 | 20 | ప్రాయము | పాయము |
| 13 | 11 | నామంబున | నా మనంబున |
| 16 | 14 | కలదె ? | కలదే ? |
| 22 | 22 | భక్షించుటె | భక్షించుచె |
| 24 | 27 | శాహూ | శాహ్రూ |
| 29 | 6 | గూడను | కూడను |
| | 18 | నీబాల | యీబాల |
| 31 | 5 | ప్రథితస్ఫిగ్ధ | ప్రకృతిసిద్ధ |
| 35 | 18 | సంకడీంద్రతో | సంకశీంద్రతో |
| 33 | 23 | గలద | గడల |
| 41 | 6 | కుమార్తె | కొమార్తె |
| 45 | 2 | వల్కాలాజిన ధారిణై | వల్కాలాంబర ధారిణియై |
| 48 | 5 | (అందులు నిద్రపోయింతురు) | (నిద్రపోయింతురు) |
| | 7 | వల్కాలాజిన ధారియై | వల్కాలాంబర ధారియై |
| 50 | 18 | వెఱుంకగ | వెఱుంగక |
| 55 | 21 | శిరోవేద | శిరోవేదన |
| 57 | 5 | లిండ్లనే | లిండ్లనే |
| 63 | 3 | ఎట్టికేలకు | ఎట్టకేలకు |
| | 19 | నెవాక్క | నేవొక్క |
| 64 | 8 | దమయంతీ | దమయంతి |
| | 21 | ప్రతివ్రతా | పతివ్రతా |
| 65 | 6 | కుమార్తెను సావిత్రినను పేరఁబరఁగు | కొమార్తెను సావిత్రియను పేరఁబరఁగు |
| 78 | 6 | సమవర్తి | సమవర్తి |
| 79 | 9 | చుట్టయిన | చుట్టయిన |
| | 17 | చెప్పుమా | చెప్పుచు |

ముద్రణశాలీక్యములలోని రేఫ ఆకార పరస్పరాదేశములు అర్ధానుస్వార న్యూనాధికములు విడిచి ముఖ్యమైనవి మాత్రమే సవరింపఁబడినవి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 41 | 1 | దర్శమునకే | దర్శనమునకే |
| 42 | 22 | జేయుంచు | జేయించు |
| 64 | 23 | ధారా | ధరా |

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| గురుస్తుతిలో | యవఘ | యవఘు |
| ప్రశంసలో | విహితులు | హితులు |
| విజ్ఞప్తిలో | సుమార్పిటికి | సుమారిప్పటికి |

